Regd. No. M. 3824

# నవశక్తి

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ వారపత్రిక

సంపాదకవర్గం: మద్దుకూరి చంద్రశేఖరరావు (సంపాదకుడు), కంభంపాటి సత్యనారాయణ, పుచ్చలపల్లి సుందరయ్య, తుమ్మల వెంకట రామయ్య

సంపుటం 2 } బుధవారం 21-12-38 బెజవాడ {సంచిక 2




ప్రకాశం కమిటీ రిపోర్టు రాజాజీకి యిష్టంలేదని వినికిడి.

# మన రాజకీయాలు

## వైస్రాయి—ఫెడరేషన్

ఏసోసియేటెడ్ చాంబర్ ఆఫ్ కామర్సు సభలో ఫెడరేషన్‌ను గురించి వైస్రాయి దీర్ఘముగా ఉపన్యసించాడు. బ్రిటిష్ ప్రభుత్వంచే ప్రసాదించబడిన ఫెడరల్ రాజ్యాంగ విధానములో మార్పులు కొన్ని వస్తాయని ఆశించిన కొందరు మితవాద ప్రముఖులకు తప్ప, యీ ఉపన్యాసం ఇతర స్వాతంత్ర్యాభిలాషుల కెవరికీ ఆశాభంగం కలిగించదు. ఫెడరేషన్‌వల్ల ఇండియాకు ఐక్యత ఏర్పడుతుందని చెప్పేవారి వాదనకు మన జాతీయ నాయకులంతా యిదివరకే అనేకసార్లు జవాబుచెప్పారు. ఆ వాదనే యీ రోజున వైస్రాయి మళ్ళాచేశాడు. రాష్ట్ర స్వపరిపాలన విషయంలో ప్రజా ప్రతినిధులైన మంత్రులు నూతన రాజ్యాంగ చట్టాన్ని ఎంతో జయప్రదంగా అమలు పరుస్తున్నారు కాబట్టి, ఫెడరేషన్ విషయంలో కూడా చిక్కులేవీ ఉండవని వైస్రాయి మన కాంగ్రెసు పెద్దలకి ఆశ చూపెట్టాడు.

ఫెడరేషన్ పనికిరాదని ఎలుగెత్తి చాటుతున్న 36 కోట్లమంది భారతీయుల ప్రజాభిప్రాయానికి వైస్రాయి ఉపన్యాసం "ఛాలెంజ్" అన్నమాట. ఈ "ఛాలెంజ్"కి ప్రతిగా కాంగ్రెసు నాయకులు తీవ్రమైన ఫెడరేషన్ ప్రతికూలోద్యమానికొక కార్యక్రమాన్ని ఈయవలసి యుంటుంది.

## పట్టాభిగారికి సవాలు !

పశ్చిమ కృష్ణా జిల్లా కాంగ్రెసు కమిటీకి చేరిన సుమారు 35,000 మంది కాంగ్రెసు సభ్యుల సభ్యత్వాన్ని రద్దు చేస్తూ, డాక్టరు పట్టాభిగారు మద్రాసు నుంచి టెలిగ్రాం ద్వారా తెలియజేశారు.

రాష్ట్రీ కాంగ్రెసు కమిటీకి ఇంతవరకు చేరిన 29,000 సభ్యత్వ ఫారాలు, వాటి తాలూకు సొమ్ము, న్యాయప్రకారం జిల్లా కమిటీకి చేర్పక పోవడమే గాకుండా, బ్యాంకులో డబ్బు కట్టలేదనే మిషతో, పావలా చందా లిచ్చిన 35,000 మంది కాంగ్రెసు సభ్యుల గొంతుకలు పట్టాభిగారి కలంపోటుకి ఆహుతి అయాయి. రాష్ట్ర సంఘానికి చేరిన సభ్యత్వ రుసుముతోబాటు మొత్తం సొమ్మును బ్యాంకులో వేయడానికి జిల్లా వర్కింగుకమిటీవారు 8—12—38 వతేదీని చేసిన తీర్మానాన్ని పట్టాభిగారికి పంపితే, అట్లా వీల్లేదని పట్టాభిగారు తంతి ఇచ్చారు. ఆతంతిని గురించి ఆలోచించడానికి జిల్లా వర్కింగ్ కమిటీని సమావేశ పరుస్తున్నాం అని జిల్లా కమిటీ వారు జవాబిచ్చారు. కాని, పట్టాభిగారు సాహసంతో 35,000మందిసభ్యత్వాన్ని రద్దు చేశారు. తన ముఠావారు గడువుదాటిన తరువాత చేర్పించిన 29,000 మంది సభ్యత్వం చెల్లదని జిల్లా సంఘంవారు తెచ్చిన అభ్యంతరాన్ని తోసివేసి, చివరికి యీవిధంగా తన ముఠాను బలపరుచుకోవడానికి పూనుకున్నారు. సొమ్మును, బ్యాంకులో కట్టకపోవడం న్యాయవిరుద్ధంఅని తోస్తే, దాన్ని గురించి సక్రమ విచారణ జరిపి, జిల్లా నాయకుల్ని తగిన శిక్షకు గురి చేయవచ్చు. అంతే గాని, కాంగ్రెసు సంస్థమీదగల భక్తికొద్దీ, ప్రేమకొద్దీ, ఉత్సాహంకొద్దీ, పావలా చందాలిచ్చిన అమాయక ప్రజల సభ్యత్వం రద్దు చేయడంలో ఎంత న్యాయం ఉన్నదో పాఠకులే ఊహించుకోవాలి.

వార్ధాలో జరిగిన వర్కింగ్‌కమిటీ సమావేశంలో, చందాలు చెల్లించనట్టిగాని, దొంగసంతకాలు పెట్టినట్టిగాని సభ్యుల సభ్యత్వఫారాల్ని రాష్ట్రీ కాంగ్రెసు కమిటీలు సరియైన విచారణ జరిపి, రద్దుచేయవలసిందంటూ తీర్మానంచేస్తే వర్కింగ్‌కమిటీ సభ్యులైన పట్టాభిగారే దాన్ని ధిక్కరించి, పావలాలు చెల్లించిన కాంగ్రెసు సభ్యులమీద ఆంక్ష విధించడం అధికారమదాంధత ఆ నా లో మ రే మ నా లో తెలియడంలేదు. కొత్త జిల్లా కాంగ్రెసు కమిటీలో తన వ్యతిరేక ముఠాకు మెజారిటీ వస్తుందేమోనని భయపడి పిరికితనంతోచేసిన అనాలోచితకార్యం, యిది: దీన్ని సమర్థించుకొంటూ సొమ్ముచెల్లించిన 35,000 మంది కాంగ్రెసు సభ్యులకు సంజాయిషీ చెప్పవలసిందని పట్టాభిగారికి సవాలు చేస్తున్నాం.

ఒకవైపు ఫెడరేషన్‌ను భారతీయుల నెత్తిన రుద్దనున్న వైస్రాయి సవాలుకు జవాబుగా జాతీయ శక్తులన్ని బలపరచడానికి బదులు పట్టాభిగారు కాంగ్రెసులో చీలికలు కలిగిస్తున్నారు.

## జి.ఓ. నెం 742.

మన రాజధానిలో కాంగ్రెసు మంత్రులు అధికారానికి వచ్చాక, ప్రజలకు తెలియని కొత్త జి. ఓ. (ప్రభుత్వ ఉత్తరువు)లు ఎన్నో ప్రకటించబడ్డాయి. 742 వ జి. ఓ. అట్టి వాటిల్లో ఒకటి 25-3-38 వ తేదీని యిది ప్రకటించబడింది. బెజవాడ విద్యార్థులు ఈ మధ్యనే దీన్ని వెలుగులోకితీసుకొచ్చారు. దీనిప్రకారం, విద్యాధికారులు స్కూల్ ఫైనల్ విద్యార్థుల్ని గవర్నమెంటు పరీక్షకు పంపేముందు సెలక్షన్ పరీక్ష అంటూ ఒకటిపెట్టి, ఆ పరీక్షలో ప్యాసైన విద్యార్థుల్ని మాత్రమే గవర్నమెంటు పరీక్షకు పంపాలి.

ఈ "డిటెన్షన్ల" పద్ధతి చాలాకాలంనుంచి అమలులోఉన్నమాట వాస్తవమే. కాని, 742వ జి. ఓ. వల్ల యిది కాంగ్రెసు మంత్రుల అంగీకారాన్నికూడా పొందిందినుమా, అంటూ విద్యాధికార్లు విద్యార్థి ఉద్యమాన్ని అణచివేయడానికి సావకాశం ఏర్పడింది. విదేశ ప్రభుత్వంచేత ప్రవేశపెట్టబడిన విద్యావిధానంలో అనేకలోపాలున్నాయి. వాటిని సరిచేయడానికి కాంగ్రెసు మంత్రులు గట్టిగా పూనుకోవలసి యుండగా, "డిటెన్షన్లు" అనే పడపోతలతో విద్యార్థుల రక్తాన్ని పీల్చేసే పద్ధతియెడల మూకీభావం వహించడం ప్రజాప్రతినిధులైన కాంగ్రెసు మంత్రులకు తగనిపని.

ఈ జి. ఓ. ను రద్దుచేయడానికి హైస్కూలు విద్యార్థులుతీవ్రంగా కృషిచేయాలి. విద్యార్థి సంఘాలు సమావేశమై, నిర్దిష్టమైన కార్యక్రమం ఒకదాన్ని హైస్కూలు విద్యార్థుల కివ్వి తోడ్పడాలి.

## మద్రాసులో త్రిశతాబ్దోత్సవం

మద్రాసు నగరంలో త్రిశతాబ్దోత్సవము జరపడానికి సన్నాహాలు జోరుగా సాగుతున్నాయి. 1639 లో అంటే 300 సంవత్సరాల క్రితం, ఈస్టు ఇండియా కంపెనీవారు చంద్రగిరి రాజు అనుమతితో ఇప్పుడు మద్రాసుఉన్న ప్రదేశంలో స్థావరం ఏర్పరచుకొని వ్యాపారం ప్రారంభించారు. క్రమేణా అనేక కుటిల మార్గాలతో దేశంలో రాజ్యాధికారము స్థాపించుకున్నారు. అట్టి మదరాసు నగరం యొక్క త్రిశతాబ్దోత్సవం జరపడానికి అతి కోలాహలముగా ప్రయత్నాలు సాగుతున్నాయి.

ఏ యూరపియన్లో ఈ ఉత్సవాన్ని జరుపుతున్నారంటే ఆశ్చర్యంలేదు. కాని, మదరాసు కాంగ్రెసు మంత్రివర్గంలో బాధ్యతగల పార్లమెంటరీ కార్యదర్శి, వార్కీగారే అత్యుత్సాహముతో కలుగజేసు కొంటున్నారంటే, యే సామ్రాజ్య వ్యతిరేకీ సహించి ఊరుకోలేడు. ఈ ఉత్సవంలో పాల్గొనడం అంటే బ్రిటిష్ సామ్రాజ్య స్థాపనకు సంతోషం వెలిబుచ్చడమేనని గర్హిస్తూ డాక్టరు పట్టాభిగారూ, తమిళనాడు రాష్ట్ర కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడూ ప్రకటనలు చేశారు, జాతీయ పత్రికలన్నీ వార్కీగారి చర్యను ఖండిస్తున్నాయి. అఖిల భారత కాంగ్రెస్ వర్కింగ్ కమిటీలో సభ్యురాలైన శ్రీమతి సరోజినీదేవి తన అసమ్మతిని తెలియజేసింది.

ఇప్పటికైనా వార్కీగారిని రాజాజీ సరియైన మార్గంలో పెట్టకుండా మౌనము వహించడంలో అర్థం ఏమై ఉంటుందో!

## మదరాసులో రాజకీయ మహాసభ

నాల్గవ మదరాసు జిల్లా రాజకీయ మహాసభ శ్రీమతి సరోజినీ నాయుడు అధ్యక్షతక్రింద అతి వైభవంగా జరిగింది. వెల్లింగ్టన్ యొక్క శిలావిగ్రహాన్ని కాంగ్రెసు మంత్రివర్గం తీసివేయాలనీ ; వచ్చే కాంగ్రెసు మహాసభకు సుభాష్ బోసునే తిరిగి అధ్యక్షునిగా ఎన్నుకోవలసిందనీ: కార్మికుల రక్షణకై త్వరలో శాసనం చేయాలనీ; కమ్యూనిస్టు పార్టీపై కేంద్ర ప్రభుత్వం నిషేధాన్ని తొలగించాలనీ; మదరాసు త్రిశతాబ్దోత్సవంలో ప్రజలెవరూ పాల్గొన వద్దనీ: బ్రిటిష్ ప్రభుత్వం ఫెడరేషనును అమలుపరిస్తే ప్రజలు ప్రత్యక్ష పోరాటానికి సిద్ధం కావలసినదనీ; సామ్రాజ్యవాద యుద్ధం వస్తే, కాంగ్రెసునాయకులు దేశాన్ని తీవ్ర ప్రతిఘటనకు తయారు చేయాలనీ—తీర్మానాలు మహాసభలో ఆమోదించబడ్డాయి, ప్రజలలో నానాటికీ వృద్ధిచెందుతూ ఉన్న రాజకీయ చైతన్యానికి యీ రాజకీయ మహాసభ ప్రబల నిదర్శనం.

ఐతే, విచారించవలసిన ఘటన ఒకటి జరిగింది. వివిధ సంస్థాన ప్రభుత్వాల నిరంకుశత్వానికి గురిఅవుతున్న సంస్థాన ప్రజలయెడ సానుభూతిని ప్రకటిస్తూ మహాసభలో ఒకరు తీర్మానాన్ని ప్రతిపాదిస్తే, అధ్యక్షురాలు దానికి అనుమతి ఈయలేదు. అది వర్కింగ్‌కమిటీ తీర్మానానికి వ్యతిరేకంఅనీ, బాహాటంగా వట్టి సానుభూతి తీర్మానాలు ప్యాస్‌చేయడంవల్ల ప్రయోజనం లేదనీ, ఆమె చెప్పింది. కాని, వర్కింగ్ కమిటీ తీర్మానంలో యీవిధంగాఉంది: "పౌరసత్వపు హక్కులకొరకు, బాధ్యతాయుత పరిపాలనకొరకు, సంస్థానప్రజలు కోరేకోరికను యీకమిటీవారు బలపరచుచూ, స్వాతంత్ర్యం కొరకు కృషిచేస్తున్న ఆయా ఉద్యమాలతో పూర్తిగా ఏకీభవించుచున్నారు." సంస్థానప్రజల పోరాటంలో కాంగ్రెసు సంస్థ ప్రత్యక్షంగా కలుగజేసుకొనవద్దని ఆ తీర్మానంలో ఉన్నది గాని సానుభూతిని ప్రకటించరాదని లేదు !

## ఆంధ్ర జిల్లాలలో తుపాను నష్టం

తుపాను సంభవించిన 15 రోజుల అనంతరము రివెన్యూబోర్డు సభ్యులు ఆయా ప్రాంతాలలో సంచారముచేసి తిరిగివచ్చి పంటలకు విశేష నష్టం వాటిల్లలేదనీ; శిస్తు మినహాలు అంత అవసరంలేదనీ అభిప్రాయమిచ్చారు.

తుపానువల్ల నష్టపడిన మూడు జిల్లాలలోను రివెన్యూ మంత్రి ప్రకాశం పంతులుగారు సంచారం చేసివచ్చి, మొత్తం 3 కోట్ల రూపాయల వరకూ ఈయేడు నష్టం వాటిల్లినదని స్వయముగా తెలియజేస్తే, రివెన్యూబోర్డు మెంబర్లు వ్యతిరేకాభిప్రాయం ఈయడం నిజంగా సాహసమే !

పశ్చిమగోదావరిజిల్లా కలెక్టరుకూడా మొదట్లో యీవిధమైన రిపోర్టేవ్రాసి పంపాడు. కాని, ప్రజల ఆందోళనవల్ల దాన్ని ఉపసంహరించుకొని, సరియైన రిపోర్టు ఈయవలసివచ్చింది. అదేవిధంగా యిప్పుడుకూడా ఆయా ప్రాంతాలలో పనిచేసే రిలీఫ్ కమిటీలు, ప్రజాసంస్థలు వివరమైన లెక్కలు ప్రభుత్వానికిపంపి, యదార్థ పరిస్థితుల్నిగురించి తెలియజేయాలి. రాజాజీ కూడ రివెన్యూబోర్డువారి సలహాలకు చెవి యొగ్గకూడదు.

## యు. పి. ప్రభుత్వం-కమ్యూనిస్టులు

యు. పి. ఎసంబ్లీలో శాసనసభ్యులడిగిన ప్రశ్నలకు ప్రధాని గోవిందవల్లభపంతు జవాబిస్తూ, రామేశచంద్రసిన్హా—భట్టాచారి అనే యిద్దరు కమ్యూనిస్టు ఖయిదీలు యు. పి. జయిళ్ళలో ఉన్నారనీ; వారు కమ్యూనిస్టు పార్టీలో సభ్యులు కానట్లు తెలియజేస్తే విడుదల చేయబడతారనీ చెప్పాడు.

నిషేధించబడిన కమ్యూనిస్టు పార్టీపై నిషేధాన్ని తొలగించాలని ఇండియా ప్రభుత్వంమీద బలమైన ఒత్తిడి తేవలసియుండగా అట్టి ప్రయత్నాలేచేయక, అధమం రాజకీయఖైదీలను విడుదలచేయాలి- అనే కాంగ్రెసు ఎన్నికల ప్రణాళిక ప్రకారం వీరిని విడుదలచేయకుండా, జైళ్ళలో మ్రగ్గే యువకులమీద ఈవిధంగావిరుచుకుపడ్డం కాంగ్రెసు మంత్రులకు న్యాయంకాదు. ఇండియా ప్రభుత్వాన్ని కోరడం కాంగ్రెసు ప్రతిష్ఠకు భంగకరంఅని పంత్ చెప్పాడు. కాని, ఇన్‌కంటాక్సు బిల్లుయొక్క 49 వ క్లాజు రద్దుచేయవలసిందని అన్ని రాష్ట్రాల కాంగ్రెసు మంత్రులు వైస్రాయికి టెలిగ్రాంలు యివ్వడం, ఫెడరేషన్‌కువ్యతిరేకంగా ఆయా శాసనసభలలో తీర్మానాలు ప్యాస్‌చేసి వైస్రాయికి పంపడం, ఏవిధంగా కేంద్రప్రభుత్వంమీద ఒత్తిడితేవడం అయిందో, కమ్యూనిస్టుపార్టీపై నిషేధాన్ని తొలగించవలసిందని కేంద్ర ప్రభుత్వానికి తెలియజేయడంకూడా అట్టిదే.



21—12—38 బుధవారం

## వర్కింగు కమిటీ దారి తప్పింది!

అఖిల భారత కాంగ్రెసు కార్యసంఘము అనేక ముఖ్య సమస్యల పరిష్కా రించవలసిన సమయాన వార్ధాలో సమావేశ మయింది. సంస్థానాల ప్రజా ఉద్యమము, దానితోపాటు నిరంకుశ నిర్బంధ విధానము తీవ్ర మగుచున్నవి. మే మంతిమా చైత న్యము పొందిన కార్మిక, [illegible] ప్రజా పోరాటమును జాతీయ విరోధులైన అధికారులచే అణచివేయబడు చున్నది. అంతర్జాతీయ రంగమున బ్రిటీషు సామ్రాజ్యవాదులు ఫాసిస్టులతో సహ కారం చేస్తూ, వారిని దేశాల ప్రజల స్వాతంత్ర్య పోరాటాన్ని దారుణంగా అణచివేస్తు న్నారు. భారత జాతీయోద్యమానికి నాయకత్వం వహించి సమావేశమైన వర్కింగు కమిటీ ఈ సమస్యల గురించి ఏమి చెప్పింది?

సంస్థానాధీశులు బ్రిటీషు అధికారుల సహాయంతో ప్రజలపై గావించుచున్న తీవ్ర నిర్బంధ [illegible] దినదినమూ పెరుగుతున్న రోజులివి. హరిపుర కాంగ్రెసు తీర్మానించిన విధంగా విధానమును మార్పు చేయాలని ప్రజ లందరు కోరుచున్నారు. కాని కార్య సంఘము గాంధీగారి సలహా క్రింద "కొందరు నరేంద్రులు తమ ప్రజలను అణచుటకు బ్రిటీషు ప్రభుత్వ సహాయము పొందా" రనియు, "కొన్ని చోట్ల [illegible] అమానుషమైన నిర్బంధ విధానము [illegible] దినా" రనియు, గుర్తించి వారు "నరేంద్రులు కాలగతిని గమనించి ప్రజల న్యాయమైన హక్కులను గుర్తించా"లని పవిత్రమైన కోర్కెను వెల్లడించింది. [illegible] అంటే బయటివారు సంస్థానాల ప్రజా ఉద్యమంలో పాల్గొనరాదు: పాల్గొనుట విజయానికి కవసరమైన సంస్థాన ప్రజా ఉద్యమాభివృద్ధికి ఆటంకము అని తీర్మానించింది.

ఇతరుల సహాయము, హక్కులకొరకు పోరాడుచున్న లక్షల నెట్లు బలహీన పర్చునో మాకు బోధపడుటలేదు. పైగా భారత జాతీయతకు విరోధులైన బ్రిటీషు వారితో చేయిలు గల్పుచున్న నరేంద్రుల [illegible] నమ్మకముంచి, ప్రజా పోరాటములో జయ్యగలుగను చూస్తున్న జనం, పరిపక్వమైన పరిస్థితులకు నాయ కత్వం వహించుటకు వెనుకాడుటయేనని [illegible]. పైగా కాంగ్రెసు మంత్రులు సంస్థానాలలోని చెడు పాలన గురించి బ్రిటీషు అధికారుల దృష్టికి తేవా లనడంతో సంతృప్తి పడుతోంది వర్కింగు కమిటీ. ప్రత్యక్ష ప్రజా పోరాటం ద్వారా ప్రతిష్ఠ గడించిన కాంగ్రెసు, నేడు కాన్స్టిట్యూషనల్ విధానంతో తృప్తిపడి ప్రముఖ కాంగ్రెసు వాదులైన సేనాపతి బాపట్ వగైరాలు సంస్థాల జైళ్ళలో మగ్గు చుండ, బ్రిటీషు యిండియన్లు సంస్థాన ప్రజా పోరాటం నుండి దూరంగా ఉండా లనడం ఆలోచన లేని సంగతి కాదు.

కాంగ్రెసువాదులు మత సంస్థలైన హిందూ మహా సభ, ముస్లిం లీగులలో సభ్యులుగా ఉండరాదని తీర్మానించింది. ఇది అవసరమైన తీర్మానమే. దీనితోపాటు కాంగ్రెసు ఉద్యమాల్లో ఇమిడియున్న హిందూ సాంప్రదాయాలను కూడ మాని రాజకీ యముగానే ఉద్యమాలు నడుపుటకు చేయాలి.

ఇప్పుడున్న 18 పెన్సుల రేటు వలన విదేశి వ్యాపారానికి, స్వదేశీ పరిశ్రమల కు నష్టమును గలిగించుచున్నది గాన, రూపాయకు 16 పెన్సుల మారకపు రేటు ఉండాలని తీర్మానించారు. 18 పెన్సుల మారకపు రేటు బంగారం ఎగుమతి చేయుట ద్వారానే నిలబెట్టబడుచున్నది. యీ పద్ధతి కొనసాగుట దేశ శ్రేయస్సుకు భంగకరం గాన వెంటనే గవర్నరు జనరల్ గారు 16 పెన్సులకు మారకపు రేటు తగ్గించాలని కోరారు.

భూలాభాయి దేశాయి సెంట్రల్ అసెంబ్లీలో ఇన్‌కంటాక్సు బిల్లు విషయంలో ప్రభుత్వం రాజీకి వచ్చుటలో ముగిసిపోయి, ప్రభుత్వోద్యోగులను, యూరోపియన్లను, భారతీయుల [illegible] అభినందించారు. మారకపు రేటును కూడ అట్టి రాజీ భావంతోనే గవర్నరు జనరలు అంగీకరిస్తాడనే ఆశతోనే వర్కింగ్ కమిటీ ఈ అపీలు చేసినట్లున్నది. అయినా గవర్నరు జనరలు మారకపు రేటును మార్చనని, ఈ ఆశలను అడియాసలను గావించారు. కాన్స్టిట్యూషనల్ పద్ధతులపై నమ్మకము ఇలాంటి ఫలితాలనే తెస్తూ ఉంటుంది.

పాలస్టయిన్‌లో బ్రిటను అవలంబించుచున్న నిర్బంధ విధానమును నిరసన తెల్పుతూ, త్యాగదీక్షతో పోరాటం సల్పుచున్న అరబ్బులకు అభినందనాలు తెల్పింది. బ్రిటీషు ప్రభుత్వ విదేశాంగ రాజనీతి, పలన రాజ్యాల నీతిపై తేబడిన రెండు తీర్మా నాలు గాంధీజీ సలహాపై అవివేయబడినవని వార్తలు. యూరపు పరిస్థితులపై కాంగ్రెసు తన పాలసీ యిప్పుడు ప్రకటించుట సమంజసము కాదని మహాత్ముని అభి ప్రాయమట. క్రిందటి జకోస్లావేకియా ఆక్రమణ సమయంలో - క్లిష్ట పరిస్థితుల నెదుర్కొనడానికి మనం సంసిద్ధులంగా లేము. సంగ్రామం ప్రకటించబడిన తరువాత సామ్రాజ్యవాదులు మనకు సర్దుకోటానికి అవకాశం యిస్తారనుకోవడం పొరపాటు. అప్పుడు ఒక తీర్మానం చేసినంత మాత్రాన ప్రజలు పోరాటానికి సిద్ధం కాలేరు. అందులకు ఎంతో సన్నాహం, నిర్మాణం అవసరం. కాన ముందే సంగ్రామ సమ యంలో మన పాలసీ నిర్ణయించుకొని, అన్ని పరిస్థితుల నెదుర్కొనుటకు ఆయత్తు లై వుండుట కాంగ్రెసువంటి ప్రజా సంస్థకు తప్పనిసరి. త్రిపురా కాంగ్రెసు మహాసభ యైన యిట్టి కొరత తీర్చవలెనని కోరుతాము.

చివరిది, ముఖ్యమైనది, కార్యసంఘము చేసిన శుద్ధి తీర్మానము. అనేక ప్రాం తాలనుండి వచ్చిన ఫిర్యాదులను బట్టి, దొంగ సభ్యులను సభ్యులను చేర్పించుట, తప్పుడు [illegible] జరిగినట్లు తెలియుటచే రాష్ట్ర కాంగ్రెసు సంఘాలు సభ్యత్వాలను పునఃపరిశీలించి, కాంగ్రెసు నిబంధనల ప్రకారం సభ్యులు కాజాలని వారి సభ్యత్వాలను రద్దుచేయాలని తీర్మానించింది. ఇంకా నిబంధనావళిలో ఈక్రింది మార్పులను గావించాలని సూచించుతోంది. (1) మూడు సంవత్సరాల నుండి కాం గ్రెసు సభ్యులైనవారే ఎన్నికకు నిలబడాలి. అయితే రాష్ట్ర కమిటీ స్త్రీలు, రాజకీయ ఖయిదీలు, అల్పసంఖ్యాక, వెనుకబడిన తరగతులకు మాత్రం యీ నిబంధనను తగ్గించవచ్చును. (2) ఐదువేల గజాల నూలు వడికి యిచ్చిన గాని, లేక రాష్ట్ర కమిటీ యిచ్చిన పనిగాని, చేసినవారే ఎన్నికలకు నిలువ వచ్చును. ఈ పద్ధతికి [illegible] ప్రతివారు రాష్ట్ర కమిటీనుండి పొందాలి. ఇంకా శుద్ధి సూచనలు గావించమని రాష్ట్ర కాంగ్రెసు సంఘాలు కోరబడ్డాయి.

నేడు కాంగ్రెసు సంఘాలలో కుళ్ళు ప్రవేశించిన సంగతిని మేమూ గుర్తింపు తాము. కాంగ్రెసు మంత్రిపదవులు స్వీకరించుటతో అనేకమంది స్వార్థపరులు, జిల్లా బోర్డులు, మ్యునిసిపాలిటీలు తమ జీవిత పరమావధిగా పెట్టుకొన్నవారు చేరారు. చేరుచున్నారు. ఒక సంయుక్త రాష్ట్రాలు, కేరళ తప్ప తక్కిన అన్ని రాష్ట్రకాంగ్రెసు కమిటీలు మితవాదులైన గాంధీ అనుచరుల చేతుల్లోనే ఉన్నాయి. వీరికి లోకలుబోర్డు ఎన్నికలలో జయమే ప్రధానం, పరమావధిగా మెంచి, ప్రజలలో కాంగ్రెసుకున్న పలుకుబడిపై ఎనలేని విశ్వాసం లేక అభివృద్ధికి రాజభక్తిపరులైన భాగ్యవంతులు లోకలుబోర్డు [illegible] కట్టబెట్టి కాంగ్రెసును ముప్పించారు. నూటికి నూరుపాళ్ళు కాంగ్రెసువాదులను వదిలివేసి, నూతన [illegible] ఎన్నికలలో కాం గ్రెసు తరఫున నిలబెట్టుటకు ఉదాహరణాలు ఆంధ్రదేశంలోనే ఎన్నో వున్నాయి. ఈ నూతన మితవాదులు, అతివాదులైన గాంధీస్టులుకలిసి, లోకలుబోర్డు పాలనా విషయాల్లో చేసిన అవకతవకలు కాంగ్రెసు ప్రతిష్ఠకు భంగం తెస్తున్నాయనే సంగతి లోక విదితం.

ఇంతేకాదు. మంత్రిపదవుల్లో వున్న ఈ గాంధీ అనుచరులే, రాజన్, రాజాజీ వంటి మంత్రులు పార్లమెంటరీ సెక్రటరీలు ప్రభుత్వ యంత్రంలో ఒక భాగమని భావించుట, ప్రజాసేవకులపై సి. ఐ. డి నిఘా పూర్వం మాదిరిగానే వుంచుట, మహాత్ముడు అతని అనుచరులు గమనించరు-యిష్టం లేదు గాని: కాంగ్రెసుహయాములో కూడ ప్రభుత్వ యంత్రం మద్రాసు, బీహారు, బొంబాయి వగైరాచోట్ల, కార్మికు లకు వ్యతిరేకంగా, మునగాల, కాళీపట్నం, బీహారు వగైరాచోట్ల రైతులకు వ్యతిరే కంగా ఉపయోగించబడుతోంది. మన ఖర్మం కాలితే యిది మహాత్మునికి కుళ్ళుగా గాన్పించడంలేదు.

ఇప్పుడు కార్యసంఘం సూచించిన కాంగ్రెసు పునర్నిర్మాణ సూచనలు పైకుళ్ళు కడగటానికి కాదు. ఏమంటే అధికారమంతా రాష్ట్ర కాంగ్రెసు సంఘాలకు యివ్వ బడింది. ఆ సంఘాలలో యిప్పుడు నాయకులుగా వున్నవారే ఈ కుళ్ళు కంతకు కార కులు. ఆంధ్రరాష్ట్రంలో క్రిందటి సంవత్సరమే పశ్చిమ గోదావరి, తూర్పు కృష్ణా, పశ్చిమ కృష్ణాలలో అతివాదులను కాంగ్రెసు కమిటీలలోనికి రాకుండా చేయడానికి చేసిన నియోజక వర్గాలు, పెద్దైలలోని ఓట్లు తారుమారు చేయుట, మొదలైనవి చేసి నది రాష్ట్ర నాయకులే. వారికీ పరిశీలనాధికారం యిచ్చుట గాంధీవాదులకు వ్యతిరేకు లయిన అతివాదు లందరను కాంగ్రెసు కమిటీల నుండి తరిమివేయుటకే!

అచటి మహాత్ముని ఉపదేశాన్ని ఇచటి ఆచరణలో పెట్టుటకే కాబోలు డాక్టరు పట్టాభి అప్పుడే ఉపక్రమించారు. పశ్చిమ కృష్ణా కాంగ్రెసు కమిటీవారు చేర్పించిన 35 వేలు పైగా సభ్యత్వాన్ని రద్దు చేశారు!

ఇది కాదు పద్ధతి కాంగ్రెసు సౌశీల్యాన్ని, డిసిప్లిన్ కాపాడటానికి. కాంగ్రెస్ యిచ్చిన ఫైజ్‌పూర్ కార్యక్రమముంది. ఎన్నికలప్రణాళిక వుంది. దీనిని అమలులో పెట్టడానికి కాంగ్రెసు కమిటీలు, నాయకులు, మంత్రులు ఏమి చేసారు? ఏమి ప్రయ త్నించారు? అనే సూత్రంపై శుద్ధి మొదలెట్టండి. కాంగ్రెసు వాదులు అహింసా అంతరాత్మలకు వ్యతిరేకంగా చరించారనే ప్రశ్నపై గాదు శుద్ధి: పోలీసు అధికారులు ప్రజలపై గావించిన దౌర్జన్యాన్ని సమర్థించినవారిపై, అట్టి దౌర్జన్యాన్ని ఎదురించని వారిపై, కాంగ్రెసువంటి సంపూర్ణ స్వాతంత్ర్య సంపాదనా బద్ధకంకణమైన సంస్థ, చేయవలసి ఉంటుంది శుద్ధి.

కార్యసంఘ తీర్మానాలన్నీ సమన్వయించి చూస్తే, గాంధీగారు హరిజన్‌లో వ్రాసిన "నేను దారిలేని సముద్రంలో ప్రయాణం చేస్తున్నాను.నేను తరచు మార్గాలు వెతుక్కోవాలి. నేనే అలా వుంటే అంతకంటే హీనంగా ఉన్నారు మంత్రులు...." అను మాటలు, వారలను ఉద్దేశించి వ్రాయకపోయినా నేటి కాంగ్రెసు నాయకత్వ స్థితి యొక్క చక్కని నిరూపణ.



# న్యాయశాస్త్రంలో న్యాయం లేదు!

## 22 ఏళ్ల శిక్షననుభవించిన నిరపరాధి టామ్ మూనీ

మేరీమూనీ ఆవవానికి ముసలిదే అయినా, ఆమె నీలి నేత్రాల ఏకాగ్రత ముందు ప్రపంచ రాజకీయ వేత్తలు గడగడలాడేవారు. మాట్లాడేటప్పుడు ఆచిన్ని పెదవుల కదలిక ఆమెలోని పట్టుదలను సూచిస్తూ వుండేది. "నేను చనిపోయేవరకూ నా కొడుకు విడుదల కోసం పోరాడుతాను" అంది కళ్ళ నీళ్లు తుడుచుకొని. జైలులో వున్న కొడుకుతో ఇంటర్వ్యూ చేసి తిరిగి వస్తూ, తన అంతులేని ప్రయాణానికి అనాడే బయలుదేరింది. కాలిఫోర్నియాలో సెయింట్‌క్వింటిన్ జైలు నుండి యునైటెడ్ స్టేట్సుకు, యునైటెడ్ స్టేట్సు నుండి జర్మనీకి, జర్మనీనుండి రష్యాకు, రష్యా నుండిఫ్రాన్సుకు, ఫ్రాన్సునుండిబ్రిటన్‌కు ...కానిపాపిష్టి ప్రభుత్వం ఆమెను బ్రిటన్‌లో అడుగు పెట్టకూడదని శాసించింది. "మేరీమూనీని రానివ్వండి, మేరీమూనీని రానివ్వండి" అని కామన్సు భవనం కప్పు ఎగిరిపోయే లాగ గోలచేశారు ప్రజలు. లండన్‌వీధులన్నీ కరపత్రా లతో నిండిపోయాయి. ఆమెను చూడడానికి రైలు వద్దకు వెళ్ళినవాళ్ళతో "మా టామ్ చాలా మంచివాడు ....వాడు ఎవరి ప్రాణాలు తీయడు....వాడ్ని....అన్యా యంగా...." అంటూ చేతిరుమాలుతో కళ్ళ నీళ్ళు అద్దు కుంది. అది చూచిన వాళ్ళంతా రుమాళ్ళతో కళ్ళ నీళ్ళు అద్దుకున్నారు, రైలు కదలి పోయింది. "ఒక ముసలిదానికి భయపడిన ప్రభుత్వం సామ్రాజ్యాన్ని ఏలుతోంది!" అని గేలిచేశారు ప్రజలు. కాని ప్రభుత్వం చలింపలేదు. చలింపదు కూడాను. అల్లాంటి చలనమే వుంటే, జకోస్లొవేకియాలాంటి ఒకదేశాన్ని హిట్లర్‌కు అంత సునాయాసంగా బలి గావించి వుండదు!

### టామ్ మూనీ అరెస్టు

అది 1916. యుద్ధదేవత ప్రపంచమందంటావిలయ నృత్యం చేస్తూవుంది. ప్రపంచాన్ని పంచుకోడంకోసం పెట్టుబడిదార్లు చేస్తూన్న ఆమహామారణ యజ్ఞంలో అమెరికా ఇంకా ప్రవేశించలేదు. కాని తనభాగంకోసం ప్రవేశించడానికి అప్పుడేనిర్ణయించుకుంది. 1916జూలై నెలలో "సంసిద్ధ దినోత్సవాన్ని" అమెరికా అంతటా జరిపారు. అయితే ఈ వికృతాట్టహాసానికి వ్యతిరేకించిన వారు లేకపోలేదు. అతివాదులు, కార్మికులు, అనార్కి స్టులు ఈ యుద్ధంలో ప్రవేశించడాన్ని నిరశించారు. ఈ"యుద్ధంలోఅమెరికాప్రజలుపాల్గొనరు" "సామ్రాజ్య యుద్ధాలు అంతమొందాలి" అనే ప్రచారం సాగింది. కాలిఫోర్నియాలో ఈ యుద్ధ వ్యతిరేక ప్రచారాన్ని సాగించినవారిలో ప్రముఖులు టామ్‌మూనీ, వారెన్. కె. బిల్లింగ్స్. వీరి నెట్లాగైనా అణచడానికి చాలాకాలం నుండి వేచియున్న ప్రభుత్వానికి "సంసిద్ధ దినోత్సవం" మంచి అవకాశాన్ని కలుగజేసింది.

"సంసిద్ధదినోత్సవం" నాడు కాలిఫోర్నియా చాం బర్ ఆవ్ కామెర్సు (వర్తకసంఘం) ఒక ఊరేగింపు లేవదీసింది. చర్చికి ప్రార్థనలకు పోయే ఆడపిల్లలు, యువకులు, అంతా దానిలో చేరారు. కేకలు, మళ్ళీ కేకలు; ఈలలు, హుషారుతో మళ్ళీ ఈలలు; పట్టణ మంతా రణగొణధ్వనితో ఎలుగుగొడ్లు చెలరేగినట్లుగా వుంది. ఊరేగింపు ఒక సందు మళ్ళి మెయిన్‌రోడ్డు మీదికి వచ్చింది. ఇంతలో జనసమూహం మధ్య 'ఢాం, మని పెద్దధ్వని. ఒక్కనిమిషం అంతా ధూమ మయం.నిశ్శబ్దం....ఒకబాంబు పేలింది....16 గురుమర ణించారు. ఒక వందమందివరకూ గాయాలు తగిలాయి.

పోలీసులకు ఆచోకీ ఏమీ దొరకలేదు. జిల్లా అధి కారులంతా రహస్యంగా సమావేశమయ్యారు. ఎవరినో ఒకరిని అరెస్టుచెయ్యాలి. లేకపోతే "అప్రతిష్ట". దానికి తోడు బూర్జువా పత్రికలు "ఈపని కమ్యూనిష్టులే చేసి వుంటారు, వారిని వెంటనే అరెస్టుచెయ్యాలి"అని పెద్ద పెద్దక్షరాలతో వ్రాసి అల్లరి ప్రారంభించాయి. పోలీసు అధికారులదృష్టి టామ్‌మూనీమీద ప్రసరించింది. ఒక నాడు బహిరంగసభలో ఉపన్యసిస్తూండగా మూనీని, అతనితోపాటు బిల్లింగ్సును పోలీసు అధికార్లు అరెస్టు చేశారు.

టామ్ మూనీ, జైల్లో

టామ్‌మూనీ, కాలిఫోర్నియా ట్రేడ్‌యూనియన్ నాయకుడు. బూర్జువా ప్రభుత్వాలభాష ఉపయోగిస్తే, "అపాయకరమైనకమ్యూనిస్టు". తల్లి పేరు మేరీమూనీ. పెండ్లి కాలేదు, అతడొక సాధారణ కార్మిక కుటుం బానికి చెందినవాడు. కాలిఫోర్నియా కార్మికులకు ఇత డంటే అపరిమిత ప్రేమ.

### మరణ శిక్ష

టామ్‌మూనీ కేసు విచారణ ప్రారంభమైంది. కోర్టు లోకి రాగానే "ఇంతకీ మీ లా ప్రకారం నామీదమోపిన నేరం ఏమిటి?" అన్నాడు మూనీ నవ్వుతూ. జడ్జి ఫ్రాం క్లిన్ వికటంగా "అబ్బే ఏమీలేదు. మర్డర్ — 16 గురిని" అన్నాడు. "అట్లాగా! ఎప్పుడు? ఎందుకు?" అన్నాడు మూనీ. పబ్లిక్ ప్రాసిక్యూటర్ చార్జిషీటు చదివి విని పించాడు. తనకీ ఆబాంబు ప్రేల్చినవారికీ ఏమీ సంబం ధం లేదన్నాడు మూనీ. కావలిస్తే రుజువుచేస్తానన్నాడు. జడ్జి చేతికి ఒక ఫొటో ఇవ్వబడింది. "సంసిద్ధదినోత్స వ" కోలాహలాన్ని టామ్‌మూనీ ఒక మేడమీద నుండి ఆశ్చర్యంతో చూస్తూన్నట్లుంది ఆఫొటోలో. ఆ ప్రక్కనేవున్న క్లాక్‌టవర్ టైముకూడా చూపుతూన్న ట్లుంది. బాంబుప్రేలిన 2 నిమిషాల తరువాత తీయ బడింది ఆఫొటో. కాని ఆ న్యాయాధికారిన్యాయదృష్టికి దానిలో సరియైన నిదర్శనం కనబడలేదు! టామ్‌మూనీకి అతనిసహచరుడు బిల్లింగ్సుకు మరణశిక్షవిధింపబడింది. అంతవరకూ వాదోపవాదాలన్నీ అతిశ్రద్ధగా వింటూ కూర్చున్న మేరీమూనీ లేచి నిలబడింది. ఆమె ముఖం ఎర్రబారింది. పెదవులు కంపించాయి. "మాటామ్ చాలా మంచివాడు. వాడు ఎవరి ప్రాణాలు తీయడు. వాడిని అన్యాయంగా చంపేస్తున్నారు అంది గద్గద స్వరంతో. కోర్టు వెలుపల కార్మికులు "టామ్‌మూనీని విడుదలచే యాలి విడుదలచేయాలి"అని భూమి దద్దరిల్లేటట్లు కేకలు వేశారు. జడ్జి ఫ్రాంక్లిన్ వినిపించుకోకుండా లేచిపోయాడు.

మరుక్షణమే మేరీమూనీ వాషింగ్టన్‌కు ప్రయా ణము కట్టింది. వైట్ హౌస్ (యునైటెడ్ స్టేట్సు ప్రభుత్వ భవనం) లో ప్రెసిడెంటు విల్సన్‌ను రెండు చేతులూ పట్టుకు నిలబెట్టింది. కేసు వివరాలన్నీ చెప్పి నది. కడుపు దుఃఖం ఆపుకోలేక "మా టామ్ చాలా మంచివాడు, వాడు ఎవరి ప్రాణాలు తీయడు, వాడ్ని అన్యాయంగా...." ఇక మాట్లాడలేకపోయింది. ఆమె కన్నీరు చూచేసరికి, ప్రెసిడెంటు విల్సన్ గుండె నీరయి పోయింది. ఆమెను చూస్తే అతనికి కూడా దుఃఖం వచ్చింది. గద్గదస్వరంతో "నా శక్తికొలది ప్రయత్ని స్తాను. విచారపడకు తల్లీ" అన్నాడు ఆమె భుజాలు నిమిరి.

ప్రెసిడెంటు విల్సన్ కలుగజేసుకున్నాడు. మరణ శిక్ష రద్దు చేయబడింది. కాని యావజ్జీవ శిక్షగా మార్చ బడింది. అంతే.

### తిరిగి విచారణ

కాలిఫోర్నియా కార్మికులు, రష్యా కార్మికులు, ఫ్రెంచి కార్మికులు, ఇంగ్లండు కార్మికులు, ఒక రేమిటి అన్నిదేశాలవారు "టామ్‌మూనీని విడుదల చేయండి" అని ఒక్కపెట్టున గోల చేశారు. లాభం లేకపోయి నది. కాని ప్రజా ప్రతినిధి ప్రభుత్వాలని ఎన్ని చెప్పు కున్నా అసలైనప్రజా నాయకులయెడల జేసిన అన్యాయం ఎంతకాలం దాచిపెట్టగలరు? టామ్‌మూనీకి శిక్షవిధింప బడిన కొన్ని రోజులకే, సాన్ ఫ్రాన్సిస్కోలో రీగల్ అనే అతడు, పోలీసులు తనకు వ్రాసిన లేఖను బైట పెట్టాడు. ఆ ఉత్తరంలో, టామ్‌మూనీకి వ్యతిరేక సాక్ష్యం ఇవ్వమని ఒక పోలీసు అధికారి అతణ్ణి బల వంతం చేశాడు. కాని బాంబు పేలిన సమయంలో అతడు ఆస్థలానికి 90 మైళ్ళ దూరాన ఉన్నాడట. కేసులో సాక్ష్యం యిచ్చిన మాగ్డొనాల్డు అనే అతడు 1921 లో, తానప్పుడిచ్చిన అబద్ధపు సాక్ష్యమే నన్నీ, పోలీసులు తనకు లంచమిచ్చి అబద్ధపు సాక్ష్య మిప్పించారనీ ప్రకటించాడు. ఇంకా కొన్ని రోజులకి ఇతర సాక్షులు కూడా పోలీసుల బూటకాన్ని బయట పెట్టేశారు. కాని టామ్‌మూనీ మాత్రం విడుదల చేయ బడలేదు. తిరిగి 1928 లో మూనీకి శిక్ష విధించిన జడ్జి ఫ్రాంక్లిన్, కాలిఫోర్నియా గవర్నరుకు ఒక ఉత్తరం వ్రాశాడు. అందులో, ఆకేసులో జడ్జిగా వుండిన తానూ, 10 మంది "జ్యూరీ"—పబ్లిక్ ప్రాసిక్యూటర్ చచ్చిపోయాడు, బ్రతికి వుంటే అతడు కూడా నిజం ఒప్పుకునేవాడేమో—టామ్‌మూనీ నిరపరాధి అని నమ్ము

తున్నామనీ, పోలీసుల ఒత్తిడివల్ల అప్పుడట్లు చేయవలసి వచ్చిందనీ వ్రాశారు. కాని ప్రభుత్వం మాత్రం మాట్లాడ లేదు.

1931 లో ఒక షరతుమీద టామ్ మూనీని విడుదల చేస్తామన్నారు. ప్రతిరోజూ స్టేషనులో హాజరు గావాలన్నారు. టామ్ నిరాకరించాడు. "అట్లాచేస్తే నేరాన్ని ఒప్పుకుంటున్నానని అర్థం" అన్నాడు.

ఇవన్నీ మేరీమూనీకి మరింత ఉత్సాహాన్నిచ్చాయి. "వాదిస్తే తిరిగి విచారణ జరుగుతుంది" అని తీర్మానించింది. 1933 లో ప్రభుత్వం పునర్విచారణ జరిపింది. విచారణలో టామ్ నిరపరాధియని నిర్ణయింపబడింది. కాని అతడు విడుదలచేయబడలేదు.

1934 లో (85 వ ఏట) మేరీమూనీ మరణించింది. చనిపోయేముందుకూడా "మా టామ్ చాలామంచివాడు; వాడు ఎవరి ప్రాణాలు తీయడు; దుర్మార్గులు వాణ్ని అన్యాయంగా హింసిస్తున్నారు" అంది. చనిపోయిన తల్లి శవాన్ని చూడటానికికూడా టామ్ మూనీకి అనుమతి ఇవ్వబడలేదు.

1937 లో తిరిగి టామ్ మూనీ కాలిఫోర్నియా శాసనసభలో తన కేసు వాదించుకోవచ్చునన్నారు. 31 ఓట్ల మెజారిటీతో టామ్ ను విడుదలచేయాలని శాసనసభ తీర్మానించింది. కాని సుప్రీం కోర్టు ఆతీర్మానాన్ని తోసివేసింది. టామ్ మూనీ విడుదలకాలేదు. దీనిఫలితం టామ్ మూనీ 22 ఏండ్లు జైలులో వుండవలసివచ్చినా, బూర్జువప్రభుత్వాలు తమ న్యాయశాసనాన్ని ఎంతచక్కగా ఉపయోగిస్తాయో ప్రపంచానికి వెల్లడిఅయింది.

## జైలు జీవితం

టామ్ మూనీకి జైలు అధికార్లు అతివాద పత్రికలేవీ కంటబడనిచ్చేవారుకారు. అటువంటి వ్రాతలను అంతా తీసివేసేవారు. Hearst Press వార్తలతో నిండిన పత్రికలే అతనికిచ్చేవారు. అయితే ఏం? ఆపత్రికలు వ్రాసే వ్రాతలు ఎట్లా అర్థం చేసుకోవాలో టామ్ కు బాగా తెలుసు. అతడు ఏరోజు కారోజు, స్పెయిన్ లోను, చైనాలోను జరిగేవన్నీ ఉన్నవిఉన్నట్లుగా చెప్పగలడు. జకోస్లోవేకియా విషాదగాథ యావత్తూ పూసగుచ్చినట్లు మనకంటె చక్కగా చెప్పగలడు. అనుమానాలున్నచోట, తనను చూడటానికి జైలుకువచ్చినవారి నడిగి, సందేహాలు తీర్చుకుంటాడు.

ఇంగ్లండు నివాసి, మార్జరీ పొలిట్ అనే ఆమె టామును చూడటానికి వెళ్లివచ్చింది. ఆస్ట్రియా, జకోస్లోవేకియా, సమస్యలగూర్చి అతడు చెప్పిన విషయాలు ఆమె కెంతో ఆశ్చర్యం కలిగించాయి. ఇంటర్వ్యూ అయి వెళ్లిపోయేముందు బ్రిటిష్ "డెయిలీవర్కర్" పత్రికకు నీసందేశం ఏమిటి అని అడిగింది. మూనీ ఇల్లా చెప్పాడు.

"ఇప్పుడైనా జర్మనీ ఇటలీల చరిత్రనుండి బ్రిటీషు కార్మికులు పాఠాలు నేర్చుకొని ఐక్యత నెట్లుసమకూర్చు కోవాలో తెలుసుకోమను:

"తామేమి చేస్తున్నారో తెలియకచేసేవారిని క్షమించవచ్చు. కాని ఇంగ్లండు అమెరికాలలోని ఐక్యతా విరోధుల్ని, శాంతివిఘాతకుల్ని, మాత్రం క్షమించకూడదు.

"మా పాఠకులకు ఇంకా ఇల్లా అని చెప్పు. నాలో విప్లవశక్తి ఇంకా వుంది. నే నెప్పుడూ అధైర్యపడను. నాలో ఊపిరి వున్నంతవరకు నా వర్గమైన శ్రామికుల కోసం పోరాడుతాను. విడుదల అయిన మరుక్షణంనుంచీ నేను వారిహక్కులకోసం ఇదివరకు కంటె ఎక్కువ పట్టుదలతో, పోరాడుతాను."

## విడుదల

టామ్ మూనీ విడుదల కాలిఫోర్నియాలో ఒక పెద్ద సమస్య అయిపోయింది. ఒక్క కాలిఫోర్నియా ఏమిటి? బూర్జువా న్యాయశాస్త్రాన్ని గమనిస్తే, ప్రపంచానికే అది ఒక పెద్ద సమస్య! "నన్ను గవర్నరుగా ఎన్నుకుంటే టామ్ మూనీని విడుదల చేస్తా"అనే వాగ్దానంమీద కల్బర్ట్ ఓల్సన్ ఎలెక్షను ప్రచారం గావించుకున్నాడు. గవర్నరుగా ఎన్నుకోబడ్డాడు. ఈయన తన వాగ్దానాన్ని ఎంతవరకు నెరవేరుస్తాడో చూడాలి. ఒకవేళ విడుదల చేసినా, గవర్నరు దయాదాక్షిణ్యాల వల్లకాదు. టామ్ మూనీ 22 ఏళ్ళు జైలులో ఉన్నాడనీ కాదు. 22 ఏళ్ళు కాలిఫోర్నియా కార్మికులు బూర్జువా ప్రభుత్వముతో పోరాడి తమ ఐక్యతను నిరూపించు కున్నారు కనుక నే:

# నవశక్తి

## చందా వివరాలు

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ 3—0—0 |
| అర్థ సంవత్సర చందా | 1—10—0 |
| విడిప్రతి | 0—1—0 |

## ప్రకటన రేట్లు

"కాలం" వెడల్పు 2" (2 అంగుళాలు)

| | | |
|---|---|---|
| నెలకు 20 అం॥ లోపల అంగుళానికి | రూ. | 0—6—0 |
| ,, 20" అం॥ పైన | ,, | 0—4—0 |
| ,, 100" అం॥ పైన | ,, | 0—3—0 |
| పేజీ | రు | 10—0—0 లు |
| ½ పేజీ | | 6—0—0 లు |
| ¼ పేజీ | | 3—0—0 లు |

షరా:—ఈ రేట్లుపైన కమిషన్లు, డిస్కౌంటులు ఇవ్వబడవు. రు 0—8—0 లకు తక్కువ ప్రకటనలు తీసుకొనబడవు. నెలకగు డబ్బు ముందుగా ఇవ్వవలెను.

ప్రత్యేక చోటునకు, ప్రత్యేక రేట్లు.

మేనేజరు

నవశక్తి.

* * *

చందాదారులను చేర్పించాలి:

డిశంబర్ లో ఈ క్రింది విధంగా చేర్పించాలని క్రొత్తగా మరో లిస్టు ఇచ్చినాం. ఈ "కోటా"ను పూర్తి అయేటట్టు పార్టీ సభ్యులు, సోషలిస్టు అభిమానులు, ప్రజాసామాన్యము పని చేస్తారని ఆశిస్తున్నాం.

ముఖ్యంగా పార్టీసభ్యులు తీవ్రంగా పనిచేసి 'కోటా' పూర్తిచేస్తారని నమ్ముతున్నాం.

| | డిశంబర్ నెల కోటా | డిశంబరు రెండు వారాలలో చేర్పించినది. |
|---|---|---|
| విశాఖపట్టణం | 5 | 1 |
| తూ. గోదావరి | 30 | 2 |
| ప. గోదావరి | 50 | 10 |
| కృష్ణా జిల్లా | 50 | 24 |
| గుంటూరు | 30 | 23 |
| నెల్లూరు | 20 | 1 |
| రాయలసీమ | 10 | 1 |
| ఇతర స్థలాలు | 5 | 5 |
| | 200 | 67 |





# పండినా ఎండినా పన్ను తప్పదు

## ఇవ్వకపోతే తేళ్లచే కుట్టించుతారు!

## ఇదీ మన జమీన్ రైతుల స్థితి

శ్రీ పార్థసారథి

సామ్రాజ్యవాదప్రభుత్వానికి కష్టపడి పండించే రైతులూ మధ్య పన్నులు వసూలుచేసి పెట్టుటకు కొందరు మధ్యవర్తులు నియమింపబడ్డారు వారే జమీందార్లు, ఎస్టేటు ప్రొప్రయిటర్లు. వసూలు చేసిన పన్నులో $\frac{1}{3}$ భాగము తాము తీసుకొని $\frac{2}{3}$ భాగము ప్రభుత్వానికి చెల్లించడమే షరతు, కాని అవసరాన్ని బట్టి ఎప్పుడైనా తమభాగాన్ని వృద్ధిచేసుకోవచ్చునన్న స్వల్ప సదుపాయాన్ని కూడా పొందేరు మధ్యవర్తులు కాని అధికారాన్ని దుర్వినియోగం చెయ్యకూడదు.

బ్రిటిషు యిండియాలో జమీందార్లు ప్రభుత్వానికి 18 కోట్లు ముట్టచెప్పుతున్నారు పేష్కష్ పేరుతో, అంటే శాస్త్రప్రకారం వారి ఆదాయం 9 కోట్లు వుండాలి. కాని 62 కోట్లు నికరం వుంది. అంటే రమారమి 7 రెట్లు.

మద్రాసు రాజధానిలో జమీందారీలు 1500, అగ్రహారాలు, మొఖాసాలు 5000. జమీందార్లు కట్టుచున్న పేష్కష్ 49 లక్షలు. $24\frac{1}{2}$ లక్షలు ఆదాయం వుండాలి. కాని 205 లక్షలు నికరాదాయం తీస్తున్నారు. సుమారు 9 రెట్లు. ఆంధ్రదేశంలో విశాఖపట్టణము, తూర్పు, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు జిల్లాలలో సగం భాగం జమీందార్లదే. వీటితో పాటు రాజధానిలో రామనాథ్, మధుర, తిరునల్వేలి, చెంగల్పట్టుజిల్లాల్లో జమీందారీలున్నాయి. రాజధాని విస్తీర్ణం 143887 చ॥ మైళ్ళలోను 23935 చ॥ మైళ్ళు జమీందార్లదే (అగ్రహారాలు కాక)

1802 లో బొబ్బిలి ఆదాయం రెండు లక్షల ఇరవై అయిదువేలు. 1936 లో 9 లక్షలు. వెంకటగిరి 3 లక్షలు. 11 లక్షలకు పెరిగింది. గంగవరం శ్రోత్రియం 6 వేలు. 20 వేలకు పెరిగింది. ఇంకా ఇలాగే అన్నిచోట్లా పెరిగిపోయేయి. ఆదాయాలు పెరిగినా సౌకర్యాలు పెరగలేదు. పూడిపోయిన చెరువులు, జలాశయాలు. మరమ్మతులు లేవు. పండకపోతే రెమిషన్లు లేవు. నీటి సౌకర్యాలు లేక పొలాలు బీడుపెట్టినా పన్ను మానదు. పన్నులు హెచ్చుతూనే వుంటాయి. 1908 నాటికే పూర్వపు శిస్తులను 3, 4 రెట్లు పెంచి ఆ శిస్తును స్థిరపరచి 20ఏళ్ళకొకసారి $12\frac{1}{2}\%$ పెంచుకోవచ్చునన్న అధికారము పొందేరు జమీందార్లు.

ఈ యెస్టేట్లలో సర్వేలు సరిగా ఉండవు. ఉదాహరణకు బొబ్బిలి యెస్టేటులోని ఆడవరం గ్రామం 350 యకరాల పరిమితి వుంటే 450 యకరాలకు పన్నులు వసూలు. సోమవరప్పాడులో ప్రతి యకరం 75 సెంట్లే ఉంది. అండగుండాలచేనిగుంట తప్పు సర్వే వల్ల 7625 ఎకరాలు పెరిగింది.

ప్రతి యెస్టేటులోనూ దారుణంగా యకరను 1 కి 68, 80, 89 వరకూ వున్న పన్నులు చెల్లించకపోతే కావలసినన్ని బాధలు. మునగాల యెస్టేటులో పన్ను లివ్వకపోతే రైతులను ఎండలో నిలిపి మీద బండలను వుంచుతారు. మందసాలో తేళ్ల కుట్టుతూ వుంటాయి. వేగారీలు తప్పవు ప్రతిచోటా. రాజుగారింటిలో పెళ్ళి అంటే రైతుకు చావు అన్న మాట.

పన్నులకు ఒక పద్ధతి లేదు. అండగుండాల చేనిగుంటలో యకరానికి 41 రూపాయలపన్ను. దానిని చేరి వున్న గవర్నమెంటు భూమికి 7 రూపాయలే వుంది. ఇల్లాగే తక్కినచోట్లాను నీటి సదుపాయం లేనందున కారేలతో నీళ్ళు తోడితే 25% అపరాధం. ఎకరానికి తక్కువున్న పొలమునకు ఎకరం శిస్తు. మూడు యకరాల లోపు తోటలకు మూడు యకరాల పన్నులు తప్పవు.

నదిలో మునిగిపోయిన భూములకు రైతులు పన్ను లిచ్చుకోవాలి. భూమి తేలినపిదప తనకే చెందునన్న ఆశతో రైతు పన్నులు కట్టడం మానడు. లా పుస్తకాలలో మునిగి తేలుతూ వున్న భూమికి పన్నుకట్టుదైతే హక్కుదారుగా స్పష్టంగా వున్నప్పటికీ తేలినపిదప భూమిని జమీందార్లే వశపరచుకొని పొజిషన్ దావాకు దిగుతున్నారు. జమీందార్లతో పోరలేక రైతులు ఆశవిడుస్తూవున్నారు.

ఆశలకు అంతులేదు, తమకున్న భూముల వల్ల సంతృప్తిలేదు. అందుచే గ్రామకంఠాలు స్మశాన వాటికలు వగైరాలు చేర్చుకుంటూవుంటారు కొందరు ప్రొప్రయిటర్లు ఉద్యోగస్తులవల్ల తమకున్న స్నేహమును పురస్కరించుకొని గవర్నమెంటు లంకలను స్వల్ప మొత్తములకు కౌలు తీసికొని హెచ్చు మొత్తాలకు అమరకం చేస్తున్నారు. ఈ విధంగా హెచ్చు శిస్తులపన్ను పన్నుల వ్యవసాయాలవల్ల రైతులు పూర్తిగా నష్టపడి తమ భూములకు స్వల్ప మొత్తాలకే (జమీందార్లకు ఎదురుగా పాటదార్లు లేనందున) పోగొట్టుకొని, సామాన్య కౌలుదార్లుయి క్రమంగా వ్యవసాయ కూలీలుగామారిపోతున్నారు 1921 లో 21699045 గా వున్న వ్యవసాయ కూలీలసంఖ్య 1931 లో 69762077 గా పెరగడం, యిపుడు 1938 లో 10 కోట్లకు మించి పోవడం తార్కాణం జమీందారీ విచారణ సంఘంవారు 1802 నుంచీ జమీందార్ల చరిత్రను సేకరించినట్లే రైతుల చరిత్రనుకూడా సేకరించి నిర్భాగ్యులకు రక్షణ యివ్వడం ప్రధానం.

జాయింటుపట్టాలు విడదియ్యరు. గవర్నమెంటులో కనీసము 5 కుంచముల భూమికే పట్టాలున్నప్పటికీయెస్టేట్లలో యెంత భూమివున్న జాయింటు విడదియ్యరు. బకాయిలకు పచ్చగా వున్న రైతుపై దండెత్తుతారు. ఎన్ని విధాల ఆందోళన జరిపినా జాయింటుపట్టాలు విడదియ్యరు. విడదియ్య పూనుకొనరు.

తమదగ్గర పనిచేస్తూవున్న ఉద్యోగులకు జీతాలు సరిగా యివ్వరు. యివ్వకపోయినా ఆ యా అధికార్లు రైతులనెత్తికొట్టి తమ జీవితాన్ని కులాసాగానే గడుపుకుంటారు. దివాన్ల జీతాలకంటె తార్పుడుగాళ్లకు జీతాలెక్కువ. మామూళ్లకూడా వుంటాయి. దివాన్లజీతాలకుబకాయి లుండవచ్చు కాని తార్పుడుగాళ్ళ జీతాలు ఖచ్చితంగా యిచ్చివేస్తారు.

ఇంత స్వేచ్ఛగా హాయిగా సంపాదించిన డబ్బు ఎంతోసునాయాసముగా ఖర్చయిపోతూనే వుంది. విదేశయాత్రలకు, విలాసభవనాలకు, వారవిలాసినులకు, ఎంపైర్ హోటళ్ళు, పంచ్ అండ్ జూడీ డ్యాన్సులకు యింకా స్వప్న ప్రపంచాలకు చాల స్వేచ్ఛగా పోతూనేవుంది. వారసపుత్రులకు అనౌరసపుత్రులకు యుద్ధాలు. అనౌరసపుత్రులకు భరణాలు!

తూర్పు గోదావరిజిల్లాలోని ఒక జమీందారు రెండువేలు వెచ్చించి నూతనముగా తెప్పించిన ఒక గుర్రాన్ని కాడుతో పోటీగా నిలువని కారణంచేత తుపాకితో కాల్చేశారు.

జవహర్లాల్ బొబ్బిలిలో కాంగ్రెస్ సందేశాన్ని వినిపిస్తూవుండగా సభపై యేనుగులను తోలించి అసభ్యముగా ప్రవర్తించినదఫేదారును అప్పటి ప్రధానమంత్రి మందలించక పోవడమే కాక ప్రమోషను యిచ్చేరు.

విజయనగరం మహారాజా వెనుకటిఉప్పాడ రాజమండ్రి స్నానాల సందర్భంలో రెండుమూడు సార్లు రైలుపగ్గర హాజరుగానున్న కారణమున 40 రూపాయల అమీన్ ను 100 రూపాయల అమీన్ గాచేసేరు.

భారతదేశాన్ని విదేశీయులహస్తగతమొనర్చినది వీరే. 1857 లో స్వాతంత్ర్య సంగ్రామ సందర్భమున వీరు ప్రజాశక్తికి ఎదురుగా బ్రిటిషు వారికి అండగా నిలచి దేశాన్ని బానిస బంధములలో యిరికింపచేశారు. ఈ జమీందార్ల బాధలకు తాళలేక రైతులు ఎదురు తిరుగునప్పుడెల్ల బ్రిటిషుప్రభుత్వము శరణుయిచ్చి తమ ఆశ్రిత వాత్సల్యమును బుజావు చేసికొంటూ వున్నది. ముఠాదార్ల దౌర్జన్యం 1870 లోని ద్వారబంధాల చంద్రారెడ్డి కోయపితూరీ, 1922 లోని రంపపితూరీకి కారణం.

ప్రస్తుతం కొల్లి బుచ్చయ్యగారిపై మెడ్రాన్ మకాంలో నెల్లూరు వెంకట్రామానాయుడుపై, జమీన్ విచారణసంఘం యెదుట సాక్ష్యము యిచ్చినందుకు ఒక కోయస్త్రీపై యీ జమీందార్ల అత్యాచారాలు యెవ్వరూమరువరు. కాశీపట్టము విషయాలు సరేసరి. యింకాదూరంగా పోతే సంస్థానాల విశేషాలు.

ఈ జమీందార్ల దురంతాలను కొంతవరకైనా అణచుటకు జమీందారీ విచారణసంఘం పూనుకొని రిపోర్టు తయారుచేసింది. కాని కౌలుదార్లను, వ్యవసాయకూలీలను మరచిపోయింది 1802 నాటి పన్నులే స్థిరమని వ్రాశారు. అయినా ప్రపంచంలో అన్నిచోట్లా నశించిన అసభ్యమైన యీ జమీందారీ విధానాన్ని ఎందుకు మట్టు పెట్టరు?

తనభూమినే నమ్ముకొని కష్టపడి కృషి చేయురైతు, రోజంతా తనరైతుతోపాటే కష్టపడి సహకారముచేసే వ్యవసాయకూలీ వీరిరువురికిన్నీ ప్రభుత్వమునకూ మధ్యనున్న మధ్యవర్తులను ప్రభుత్వం వెంటనే తొలగించాలి. రైతులంతా ఆందోళనచేసి అల్లాంటి మధ్యవర్తిత్వమును మితిమీరినవారి అత్యాచారాలతో సహా మట్టుపెట్టేవరకు ఆందోళనచేసి ప్రభుత్వాన్ని నిద్ర పోనియ్యకూడదు.

# పాట

## విప్లవ జ్వాల

(చదలవాడ పిచ్చయ్య)

జీర్ణమైపోయిన
శిథిల దేహంలో
మినుకు మినుకంటున్న
విప్లవజ్వాలను
వెలిగించి కర్షక, కార్మికా!
నలుదిశలు పరికించరా!—
సంఘోపయోగమౌ
సకల వస్తువులను
నోర్చి నీ రక్తంతొ
ఉత్పత్తి చేశావు—
ఉత్పత్తి వస్తువులు
ఒకచోట జేర్చాక
ధనికవర్గీయులు
మన హక్కు మ్రింగేసి
వ్యక్తిత్వమును జంపి
భుక్తికి జాలని
ఆహార మిస్తారు
అధికార బలముతో—
స్వల్ప సంఖ్యాకులౌ
స్వార్థపరులగు ధనిక
వాదులు ప్రభుత్వమను
భయ శాసనమ్ముతో —
సోమరులౌ వారి
సుఖ సంపదంతాను
ఈ కష్టజీవుల
ఎముకలలొ మూలికే
తెలిసికొండని పిలుపు
హృదయాన్ని చీల్చుకొని
పసనుగల కష్టరై
కదలి వస్తుందీ—
ఒకసంర మార్చింది
ఉన్నతికి తెచ్చింది
ఆదర్శమైనట్టి
అభివృద్ధి జూపింది
కష్టపడువారిదే
కలిమిపై హక్కని
సోమరికి అందుకో
చోటుండరాదని
వేనోళ్ళ చాటుతూ
వెలుగు నిస్తుంది
కర్షక, కార్మికులు
కలసి, ఏకమ్మయి
సామ్రాజ్యవాదుల
సంకెళ్లు త్రుంచేసి
పరిపాలనాధి
కారమ్ము చేపట్టుకొని
జీర్ణ దేహాలన్ని
శిథిల గృహాలన్ని
సంతోషముతొ పొంగి
సౌఖ్యమ్ములో మునిగి
కళలు విరజిమ్మేటి
రాజ్యమ్ము స్థాపించి
రంజిల్ల జేయంగ—

# బూర్జువా ప్రజాస్వామికం— సోవియటు ప్రజాస్వామికం

భారత దేశంలో ప్రజలు తమ దేశ పరిపాలనలో పాల్గొనడం యింకా ఆచరణలోకి రాలేదు. ప్రజా పరిపాలన (డిమాక్రసీ) అనే భావము యిచట చాల క్రొత్తదే అయినా ప్రజల మనస్సులో పుష్టిగా నాటుకొన్నది. బ్రిటిషు యిండియాలోను స్వదేశ సంస్థానాలలోను, మూలమూలలనున్న గ్రామాలలోకూడ ప్రజలు బ్రిటిషు సామ్రాజ్యవాదులను భారతదేశాన్నుండి పారద్రోలి స్వతంత్ర భారత ప్రభుత్వాన్ని నెలకొల్పుటకు యెన్నో త్యాగాలు చేసారు. పోరాటాలు సాగించుచున్నారు. ఐనా మనం దేనికై పోరాడుచున్నామో ఆ ఆదర్శమును గురించి స్పష్టమైన నిర్వచనం యింకా చేయబడలేదు.

సామ్రాజ్యవాదంతో పోరాటంలో, దాని ఫలితంగా మనము అనుభవించే కష్టాలపై ద్వేషంలో మనము కేపిటలిజంలోని చెడుగులను, కేపిటలిజం చివరిమెట్టే సామ్రాజ్యవాదమనే సంగతి మరచిపోతున్నాం. భారతదేశానికి స్వాతంత్ర్యం వస్తే అన్నీ బాగుపడతాయనే మాటలతో సంతృప్తిపడుతున్నాం. కాని అది అంత స్వల్పమైన సమస్యకాదు. అనేక స్వతంత్రమైన దేశాలు ఉన్నాయి. కాని వాటిస్థితి అంతా సుఖకరంగా లేదు. వానిలోనూ పీడన, పోరాటాలు సాగుతూనే వున్నాయి. పార్లమెంటు పాలన వున్న దేశాలలోకూడ ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు తమకు అనుకూలమైన ప్రభుత్వాన్ని నిర్మించుకోలేక పోతున్నారు. వారు అసహ్యించుకొను అనేక పనులను వారు చేయాలిని వస్తూంది. అమెరికా, ఫ్రాంసు, బ్రిటను, జర్మని, ఇటలీ దేశాలలోని ప్రజలలో యెక్కువమంది పేదవాళ్లు నిరుద్యోగులుగానే వున్నారు. ఐనా వారు పేదతనాన్ని నిరుద్యోగాన్ని రద్దుచేసే ప్రభుత్వాన్ని ఏర్పరచుకోలేకున్నారు: వారు యితర జాతులను దేశాలను అణచి, దోచుకోవాలని కోరడంలేదు. వారు యుద్ధాన్ని ఆయుధ పెంపుదలను అసహ్యించుకొంటారు. ఐనా వీనిని చేయించాచేసే ప్రభుత్వాన్ని నిర్మించుకోలేకున్నారు. తద్వ్యతిరేకంగా యిన్ని విరుద్ధాలు కాన్పించుచున్న డిమాక్రెటిక్ ప్రభుత్వంలో (పార్లమెంటరీ) అత్యధిక సంఖ్యాకుల అభీష్టమే నెరవేరుతుందని మనకు పాఠాలు చెబుతుంటారు కొందరు:

అసలు డిమాక్రెటిక్ ప్రభుత్వము ఎలా వచ్చింది: నిజం చెప్పాలంటే, డిమాక్రసీ కేపిటలిజంతో పాటే జన్మించింది. ఈ విధానం 200 యేండ్ల క్రితం యూరపులో ఫ్యూడలిజం (జమీందారీ ప్రభు) స్థానే అమలులోకి వచ్చింది. ఇపుడు కేపిటలిజం (పెట్టుబడిదారీ విధానం) ప్రపంచం అన్ని మూలలను వ్యాపించింది. దానితోపాటు రాజకీయ సంస్థలు కూడ వ్యాప్తి చెందాయి. భారత దేశంలో కూడ, బ్రిటిషు పాలన క్రింద సాంఘిక రాజకీయ జీవితాల్లో కేపిటలిజం అనేక మార్పులు గావించింది. ఉపయోగించే పనిముట్లన్నీ మార్పుచెందినటులే మన యిండ్లలోని ప్రాచీన భావాలన్నీ చుడిచి పెట్టుక పోతున్నాయి. ప్రపంచంలోనూ, భారత దేశంలోనూ కేపిటలిజం పొందిన అభివృద్ధికి ఫలితంగా, భారతదేశంలో కూడ రాజకీయ మార్పులు జరుగుతున్నాయి. భారత సమాజం, కొద్ది స్థానికములగు మార్పులతో భూస్వాములు, కేపిటలిస్టులు, వర్తక వ్యాపారులు, కార్మికులు, రైతులు, చేతి పనివారలు వగైరా వివిధ వర్గాలుగా, యితర దేశాలలో వలెనే విభజింపబడి వుంది. అందుచే కేపిటలిజమును దానిలోని పరస్పర వైరుధ్యాలను అర్థం చేసికొంటేగాని భారత సమస్యలను పరిష్కరించుకో జాలము.

బ్రిటను ఫ్రాంసు, అమెరికా లాంటి, డిమాక్రెటిక్ ప్రభుత్వాల రెండు మూడు శతాబ్దాల వెనక చరిత్ర చూస్తే, అప్పటి వర్తకులు పరిశ్రమదార్లతో కూడిన బూర్జువా వర్గం, రాజులు, జమీందారుల ప్రభుత్వాలతో తీవ్రంగా పోరాడి నిర్మించినవని స్పష్టమవుతుంది. ఆ పోరాటాలలో బూర్జువా వర్గం విప్లవ సిద్ధాంతాలను లేవదీసింది: నూతన రాజ్యాంగ సంస్థలను నిర్మించింది. ఆ పోరాటాలలో జయించుటకు నూతన ఆయుధాలను, బూర్జువా సైన్యాన్ని (క్రాంవెల్ మోడెల్ ఆర్మీ వానిలో మొట్టమొదటిది) నిర్మించింది. జయం రావాలంటే బూర్జువా వర్గానికి, జమీందారీ విధానం క్రింద బాధలను భవించుచున్న, చేతి పనివారు, వ్యవసాయకుల సాయం కావాలి. అందుచే పై వర్గాలను ఆకర్షించుటకు బూర్జువా వర్గం మానవ సౌభ్రాత్రుత్వం, స్వేచ్ఛ, సమానత్వం అనే నినాదాలు లేవదీసింది. బూర్జువా వర్గం జయించగానే, అధికారం స్వీకరించి, ఫ్యూడల్ ప్రభువుల భూములను స్వాధీనం చేసికొంది. వ్యవసాయకుల బానిసత్వాన్ని తొలగించి తనకు కూలికి పనిచేయు కార్మికులను తయారుచేసింది. ఉత్పత్తి పరికరాలను వృద్ధిచేసి ఫ్యాక్టరీలను నిర్మించింది, ప్రకృతినుండి అనేక ఉపయోగమైన శక్తులను తయారు చేసింది. కాని అది యితరుల కష్టఫలాన్ని తను అనుభవించసాగింది. యంత్రాభివృద్ధి, శాస్త్రీయ అభివృద్ధి ఫలితంగా వచ్చిన లాభాన్ని బూర్జువా వర్గం, సమాజానికంతటి ఉపయోగానికి వినియోగించు ఉద్దేశం లేదు. ఫ్యూడల్ వర్గం నాశనమగుటతోనే విప్లవ ఉద్యమాన్ని అణచివేయ సాగించింది బూర్జువా వర్గం. జమీందారీ విధానం పోరాటములో తనకు సాయపడిన తక్కిన వర్గాలనుండి ఆయుధాలను లాగివేసి వారిని నిరపాయ పద్ధతులైన సక్రమ రాజకీయ పంథా అవలంబించునట్లు చేసింది. కాని బూర్జువా వర్గానికి, నూతనముగా సమాజిక రంగంలోకి వచ్చిన కూలికి పని చేస్తేనేగాని పొట్ట నింపుకోలేని కార్మిక వర్గానికి మధ్య పోరాటం ఆలాగేవుంది. నిజానికి వర్గ కలహం, కేపిటలిజం వృద్ధితోపాటు కార్మికుల చైతన్యం వృద్ధిచెంది, తీవ్రమయింది, డిమాక్రసీలోవున్న పరస్పర వైరుధ్యాల నుండి తన్ను రక్షించుకొనే ఉపాయాలు అరయక పోయిన బూర్జువా వర్గం నశించిపోయి వుండేది.

బూర్జువావర్గం డిమాక్రసీ రూపాన్ని మాత్రం ప్రజాసామాన్యాన్ని ఆకర్షించడానికి మిగిల్చింది.

కామ్రేడ్ మహమ్మదు జాఫర్

కాని పార్లమెంటరీ ప్రభుత్వం బూర్జువవర్గహక్కులను గాపాడుతూ, ప్రజాసామాన్యం విప్లవ పద్ధతులవైపు మొగ్గకుండునటుల చేయడానికి వినియోగింపబడుతోంది. మూడు నాల్గు లేక ఐదు సంవత్సరాలకొకసారి ప్రజలు తమ ప్రతినిధుల యెన్నుకోవచ్చు కానితర్వాత పరిపాలనలో వారి కెట్టి జోక్యంలేదు. పార్లమెంటులో బ్యాంకర్లు పరిశ్రమదార్లకు ప్రత్యేక ప్రాతినిధ్యం ద్వారా ఎక్కువ బలాన్ని యిస్తారు. ఇంగ్లండులోరాజు, ప్రభువులసభయు, ఫ్రాంసు అమెరికాలలో సెనెటు సభలుద్వారాను, ప్రత్యేక ప్రాతినిధ్యం ద్వారాను, ప్రజాప్రతినిధులు బూర్జువా వర్గ హక్కులకు నష్టం కలిగించకుండునటుల రక్షణ యేర్పరచుకొన్నారు. ఇంతేగాక బూర్జువా వర్గం ప్రజలలో చైతన్యం కలుగకుండా చేయడానికి, తప్పుడు ప్రచారం చేయడానికి మత సంస్థలను, పత్రికలను పోషించుతూంది, భీతి గొల్పడానికి, సివిల్, పోలీసు, మిలిటరీ శాఖల నేర్పరచింది. ఈ సంస్థలలో డిమాక్రసి మచ్చుకైనా కాన్పించదు. అవసరమైనపుడు సమ్మెలు వగైరా క్లిష్టసమయాల్లో బూర్జువాప్రజల నణచివేయడానికిపైసంస్థలన్నిటిని ఉపయోగించుతోంది. అందుచే పేరుపొందిన డిమాక్రెటిక్ ప్రభుత్వాల్లో కూడ ప్రజలకు పరిపాలనలోభాగం చాలస్వల్పం. ఉన్న స్వల్పం కూడ ప్రపంచ ఆర్థిక దుస్థితి నాటినుండి ప్రజల సామాన్య పౌరసత్వ హక్కుల తొలగించుటద్వారా రద్దుచేయబడుతూంది. ఈ విధంగా ఇటలీజర్మనీలలో ప్రజాహక్కులనాశనం గావించబడ్డాయి. నేడు బ్రిటను, యితరసామ్రాజ్య వాద ప్రభుత్వాలు వానిని అనుసరించుతున్నాయి.

అయిన బూర్జువా పార్లమెంటుద్వారానే పెట్టుబడిదారీ విధానాన్ని రద్దుచేయవచ్చునని నమ్మువారు (ఫేబియన్లు)కొందరున్నారు. విషయ పరిజ్ఞానం, చరిత్ర యిదిసాధ్యంకాదని రుజువుచేస్తున్నాయి. ఇంగ్లండులో లేబరు లిబరల్‌పార్టీలవలె డిమాక్రసీని రక్షించడానికి కొంత సాయపడవచ్చును. కాని యీ స్వల్ప ప్రజాహక్కులు కూడ బూర్జువా వర్గానికి వ్యతిరేకంగా ఎడతెగని పోరాటంద్వారా సంపాదించినవే. బ్రిటనులో కార్మికులు రోజుకు 8 గంటలపని, హెచ్చు జీతాలు సంపాదించుట, ప్రపంచంలో యింకోభాగంలో దోపిడి ఎక్కువగా సాగుటవల్లనే బ్రిటిషుకేపిటలిష్టులు, ఇండియా ఆఫ్రికాలలోని కర్షకుల దోపిడిలో పొందిన లాభంలో కించిత్భాగం బ్రిటీషు కార్మికులకు వచ్చింది. అందుకే కాపిటలిష్టు ఎపుడూ కాలనీలు కోరుతారు. కాని ఆర్థిక దుస్థితి వచ్చినపుడల్లా కార్మికులకు యిచ్చిన ఆసౌకర్యాలన్నీ తొలగించబడతాయి. వారి స్థితి దుర్భరమౌతుంది. బూర్జువా పార్లమెంటులన్నీ బ్యాంకర్లు, వ్యాపారస్థులపై ఆధారపడివున్నాయి బ్రిటనులో లేబరు గవర్నమెంటు 1934 లో సామాన్య సంస్కరణలుకూడ బ్యాంకులువ్యతిరేకించుటచే ఆచరణలో పెట్టలేకపోయింది. బ్యాంకర్లే ఫ్రాంసులో పాప్యులర్‌ఫ్రంట్ ప్రభుత్వాన్ని పడగొట్టాయి. స్వల్పమైన సంస్కరణలే సాధ్యపడనపుడు పార్లమెంటుద్వారా విప్లవయుతమైన మార్పులు గావించుట యెలాసాధ్యమవుతుంది: ప్రజాసామాన్యం తమ ప్రతినిధులను, తమ పోలీసు, మిలటరీ సంస్థలకు వ్యతిరేకంగా బలపరచకలిగినపుడేసాధ్యమవుతుంది. కాని యిందులకు మన సంస్కారవాదులు తయారుగాలేరు.

సోషలిస్టులము పూర్తి అయిన, సుస్థిరమైన డిమాక్రసీని కోరుతాము. అంటే రాజకీయ, ఆర్థిక సాంఘిక వైజ్ఞానిక రంగాలలో ప్రజలంతా పాల్గొనాలని కోరుతాము. ఇప్పటివలే అల్ప సంఖ్యాకుల లాభవృద్ధితో గాక అత్యధిక సంఖ్యాకులగు ప్రజల సౌకర్యాల కనుగుణ్యంగా పరిపాలన సాగాలని కోరతాము. అట్టి సమాజాన్ని స్థాపించడానికి బూర్జువా వర్గాన్ని అధికారంలో నుంచి తొలగించాలి. పెట్టుబడి, ఫ్యాక్టరీలు, బ్యాంకులు, భూములు ఉమ్మడి సొత్తుగా చెయ్యాలి. కాని యిదంతా ఒక రోజులో జరిగే పనికాదు, అయినా సాధ్యమైనదే. సోవియటు యూనియనులో ఆచరణలో వుంది. ఇంకా మరెచటనైనా స్థాపించవచ్చు.



## వెంకటగిరి ఎస్టేటులో

# జమీన్ రైతు ప్రచారము

కామ్రేడ్ బి. శంకరయ్య

[ప్రకాశం కమిటీ రిపోర్టును జమీన్ రైతులకు తెలియజేసి కాంగ్రెసు మంత్రులకు రైతాంగ బలాన్ని సమకూర్చుట నేడు ప్రజాసేవకుల కర్తవ్యము. ఆంధ్రరాష్ట్ర రైతు సంఘము, సోషలిస్టు పార్టీ సూచించిన మార్పులను రైతులకు తెలియజేసి, జమీన్ రైతుల కోర్కెల తెలిసికొంటూ ప్రచారము గావించుచున్న నెల్లూరు జిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కార్యదర్శి కామ్రేడ్ బి. శంకరయ్యగారి దర్శి తాలూకా వెంకటగిరి ఎస్టేటులో ప్రచారపు రిపోర్టును క్రింద ప్రకటించుచున్నాము. ప్రచారకుల అనుభవాలను తెలుపు ఇట్టి రిపోర్టులను 'నవశక్తి' యెల్లపుడు ఆహ్వానిస్తుంది.

—సంపాదకుడు.]

దర్శి తాలూకా కాంగ్రెసు సంఘ కార్యదర్శి వి. అప్పనాచార్యులుగారు, నేను కలిసి జమీందారీ విచారణ సంఘ నివేదికను గూర్చి ప్రచారము గావించి రైతులు కోరు మార్పులను తెలిసికొనుటకు బయలుదేరాము. 7-12-38 వ తేదీ సాయంత్రం 2 గంటలకు లక్కవరం గ్రామం చేరాము. చాలామంది రైతులు పొలం పనికి పోయారు. ఉన్నవారంతా నీలంరాజు పట్టాభిరామయ్యగారి యింటివద్ద సమావేశమయ్యారు. ప్రకాశం కమిటీ నివేదికను, రాష్ట్రరైతు సంఘ సూచనలను తెలియజేశాము. ఆ గ్రామం భూములు నిస్సారమైనవి. చెరువులు మరమ్మతు జరుగుటలేదు. బావుల క్రింద కొద్ది భూమిలో మాత్రం రాగి, సజ్జ యెంతో శ్రమపడి పండించుకొంటారు. ఈ భూములకు గొఱ్ఱు 1కి రు. 25 మొదలు రు. 40 శిస్తు వసూలు చేస్తారు, దీనిని సుఖాం రేట్లని పిలుస్తారు. 1908 కి పూర్వం యీ భూములకు రు. 2 రు. 4 వరకు శిస్తు వుండేవి. అపుడు యీ భూముల సాగు బావుల క్రిందకు మార్చి శిస్తు 10 రెట్లు హెచ్చించారు. 1908లో రైతులు దావా వేయగా, హైకోర్టు, శిస్తులు హెచ్చించుట అక్రమమని తీర్పు యిచ్చింది. కాని ఎక్కువ చేసిన రేట్లు తగ్గనేలేదు. మెట్టకు 2 మొదలు 6 రూపాయల వరకు శిస్తు ఉన్నది. పూర్వం రు 2 లోపువుండేది. తరంవారి రేట్లు లేవు, వరవళ్ళ పద్ధతి అమల్లో ఉంది.

ప్రకాశం కమిటీ రిపోర్టు ప్రకారం, సర్వే చేయించి 1802 రేట్ల ప్రకారం శిస్తు నిర్ణయం జరిగిన తరువ న్యాయం జరుగుతుందన్నారు. చెరువును బాగుచేత ప్రభుత్వ పి. డబ్ల్యు. డిపార్టుమెంటు క్రిందకు తీసికొని, ఖర్చు జమీందారుల నుండి రాబట్టాలన్నారు. తక్కిన రైతు సంఘ సూచనలన్నిటికి ఆమోదం తెల్పారు.

తరువాత బొల్లంకొండవారిపాలెము వెళ్లాము. ఇచటనూ పై సూచనలనే రైతులు బలపరిచారు. 11, 15 సంవత్సరాలనాడు కొన్ని భూములకి నైతం పట్టా విడుదలలులేవు. పూర్వపు రైతు బకాయి వున్నదని జమీందారు యీయేడాది ఒక రైతు వద్దర రు 20-0-0 వసూలు చేసారు. రైతులు జమీందారీ పద్ధతి పోతేగాని తాము సుఖపడమన్నారు. రాత్రి 8 గంటలకు సభకు రైతులందరు, కొందరు కూలీలు, స్త్రీలు షుమారు 300, వచ్చారు. ప్రకాశం కమిటీ రిపోర్టును రాష్ట్ర రైతు సంఘ సూచనలను బలపరుస్తూ రైతులు మాట్లాడారు.

8-12-38 తేదీ పొటికలపూడి జేరాము, ఈ గ్రామ రైతులు జమీందారుతో వ్యాజ్యమాడి 1908 కి తర్వాత తోట్లకు హెచ్చురేట్లు లేకుండా చేసారు. ఇచట పండినా యెండినా ఎపుడూ రెమిషన్ ఇయ్యరు. రైతులు మన్నెంను చూచి పేదరైతులకు శిస్తు రద్దుచేసే బిల్లు వచ్చిందా అని అడిగారు. అసలు యిపుడు శిస్తు తగ్గించే బిల్లు మాత్రమే పెట్టబోతున్నారనియు అదీ యింకా చట్టం కాలేదనియు చెప్పాము. సభకు 500 పైగా వచ్చారు. బకాయిలకు పరాస్తి జప్తులేకుండా చెయ్యాలనియు పేదరైతుల శిస్తు రద్దు చేయాలని కోరారు. దెల్టా ఏర్పాటు చెయ్యాలన్నారు.

9-12-38 మారెళ్ళగ్రామం వెళ్లాము. ఇచట మెట్టరేట్లు రు 3 మొదలు 4 వరకు వున్నాయి. సం॥ 1కి గొఱ్ఱుకు 40 తూమికల ధాన్యం పండును. అంటే రు 2-0-0 పైగా వచ్చునన్నారు. పల్లంలో పండిన పంటతో పీటి శిస్తు చెల్లించుతారు. అయితే భూములు ఎందుకు వదలరుఅని అడిగితే పశువుల మేతకు యిబ్బంది కలుగుననియు ఎప్పటికైనా దెల్టాగాని చెరువుగాని ఏర్పడి బాగుపడునను ఆశతో (వరిగ సంగటితో పొట్ట నింపుకొంటూ) శిస్తు చెల్లిస్తున్నామని చెప్పారు.

జమీందారు ఉద్యోగులు "శిస్తులు చెల్లించ వద్దని చెబుతామేమో" అని మమ్ము వెంబడించారు. అమాట చెప్పితే ఇపుడొక దమ్మిడీకూడ వసూలు చేయకుండాం వాళ్ళు. సాయంకాలం సభకు ముక్కరవారిపాలెం రైతులుకూడవచ్చారు. ప్రభుత్వ జప్తు అధికారం తొలగించితే శిస్తులు యిస్తారా అని అడిగాము. వారు వ్యవసాయ ఖర్చులు పోను మిగిలిన దాన్లో భాగం శిస్తురేటు యేర్పడినపుడు దమ్మిడీతో సహా యిచ్చెదమనిరి. "ఈజమీందార్లు పోయి మేమిచ్చే శిస్తు మా సౌకర్యాలకు ఖర్చుపెట్టుతూ మాకు లెక్క చెప్పేటప్పుడు మేమెందుకు శిస్తు యివ్వము?" అన్నారు.

10—12—38 వ తేదీ ఉదయం పోలవరపులో మీటింగు పెట్టి రిపోర్టు, రైతుసంఘ సూచనలు గురించి చెప్పాము. రైతులు పైగ్రామాలలో వలెనే కోరిరి.

సాయంకాలం తుకకపాలెం గ్రామము పోయాము. ఈ గ్రామ రైతులు, 1914 లో ఓటి క్రింద వున్న భూమికి గొఱ్ఱు 1కి 0-4-0 లు లేక 0-8-0 ల శిస్తును రు. 2 లేక రు. 3 లకు మార్పుటకు జమీందారు జేసిన ప్రయత్నాలను యెదిరించి గెలుపొందారు. తక్కినచోట్ల మాత్రం రేట్లుహెచ్చాయి. రైతు రిపోర్టును రైతుసంఘ సూచనలతో బలపరచారు. ఒక రైతు, జమీందారీలను రద్దుచేసే బిల్లు యెందుకు పెట్టలేదని అడిగారు. ప్రస్తుతం మనకు అధికారం లేదు. అందుకు మనం చాల బలం సంపాదించాలి అన్నాము.

పోయినచోట్లల్లా పెగరేషను ఎదిరించడానికి రైతులు సిద్ధంగా ఉండాలని హెచ్చరించాము. రైతుల ఋణపరిష్కార చట్టం పోవునని భయపడుతున్నారు. అది పోయేటట్లయిన కాంగ్రెస్ వారు మంత్రి పదవులు వదలుకొని మమ్మలను "ఏమి చెయ్యమన్నా చేస్తాము" అన్నారు.

(8 వ పేజీ తరువాయి)

సోవియటు యూనియనులో, జారు చక్రవర్తి, జమీందారులు, కేపిటలిష్టులు తొలగించబడ్డారు. వారి స్థానంలో నేడు కార్మిక కర్షకులు పరిపాలన సాగించుతున్నారు. వారి పార్టీని నిర్మించుకున్నారు, అదే కమ్యూనిస్టు పార్టీ. కార్మిక కర్షకుల రాజ్యాంగ సంస్థలను నిర్మించారు: అవియే సోవియటులు. ప్రజా సైన్యాన్ని ఏర్పరచారు: అదియే రెడ్ ఆర్మీ. వారు దేశంలోని దోపిడిగాండ్ర నుండి, విదేశ దాడుల నుండి తమ రాజ్యాన్ని రక్షించుకొన్నారు. రష్యాలో కమ్యూనిస్టులు డిమాక్రసీ కొరకు ప్రజా పోరాటాన్ని ఏండ్ల కొలది నాయకత్వం వహించి నడిపారు. ఈ పోరాటాలలో కార్మిక వర్గం కట్టుదిట్టాలతో అరితేరింది, రష్యను కర్షకులను, జారు సైన్యాన్ని తనవైపు ఆకర్షించుకొంది.

రష్యన్ కార్మిక, కర్షకులు తమ రాజకీయ నిర్మాణాలుగా సోవియటులను నిర్మించారు, అవే సోషలిస్టు డిమాక్రెటిక్ విధానానికి వక్కా స్వరూపములు.

సోవియటులు నేడు కష్టజీవుల పరిపాలక సభలు. 1917 విప్లవంలో కార్మిక కర్షక సోవియటులు స్థాపించబడి యావత్ రష్యాలోనూ విప్లవ పోరాటాలను నడిపాయి. పెట్టుబడిదారుల నుండి లాక్కొన్న ఫ్యాక్టరీలు, బ్యాంకులు, అడవులు భూమిపై అధికారం సోవియట్లు స్వీకరించాయి. స్థానిక పరిపాలన, విద్య, కోర్టులు, పోలీసులు వగైరా అన్ని శాఖలు వాటి క్రిందికి వచ్చాయి. జారు ప్రభుత్వోద్యోగుల స్థానమును స్థానిక సోవియటులు ఆక్రమించి, శాసన నిర్మాణ, కార్యనిర్వాహక పనులన్నిటిని నెరవేర్చ మొదలిడాయి. మొదట్లో కష్టజీవులందరు సోవియటుల ఎన్నికల్లో ఓటు చేయడానికి, అభ్యర్థిగా నిలబడటానికి మీటింగులకు హాజరు కావడానికి హక్కు కలిగివుండేవారు.

అక్టోబరు విప్లవానంతరము సోవియటు కాంగ్రెసు, భూమి, బ్యాంకులు వగైరా అన్నీ కార్మిక కర్షకులవే అని ప్రకటించింది. రష్యాలోని వివిధజాతులకు స్వాతంత్ర్యము సమానత్వము యిచ్చింది. స్త్రీ, పురుషులకు సమాన హక్కుల నిచ్చింది. ఈ హక్కులను యే యితర బూర్జువా పార్లమెంటులు యిచ్చియుండలేదు. కాని బూర్జువా వర్గము నాశనం గావించబడుటకు కార్మికవర్గం కఠినమైన పద్ధతులవలంభించాలి. అందు చేతనే మత గురువులకు, యితరుల కష్టంపై ఆధారపడు వారికి సోవియటుల్లో పాల్గొను హక్కు రద్దు చేసింది. ప్రజలలో ఎక్కువ మందికి అధికారం లభించింది. కాని నిర్బంధ విధాన చిహ్నాలైన పోలీసు, సి. ఐ. డి. సైన్యము, విప్లవమును రక్షించుటకు, విప్లవ ప్రతి ఘాతకుల ఆటలు సాగకుండ చేయుటకు, ఉంచ బడ్డాయి. తరువాత జరిగిన అనేక కుట్రలు సోషలిజానికి విరోధులున్నారను సంగతి రుజువు చేసాయి. అందుచే కార్మిక నియంతృత్వం అవసరమయింది.

కాని గత 20 సంవత్సరాల్లోనే సోషలిస్టు విధానం సోవియటు యూనియన్లోని వర్గాలను రద్దుచేసింది. ప్రజలలో దాదాపు అందరికి సోషలిజంపై నమ్మకం యేర్పరచింది. డిమాక్రసీ వ్యాప్తికి యింకా అవకాశాలున్నాయని రుజువు చేసింది. 1937 లో ఆచరణలో పెట్టబడిన స్టాలిన్ నూతన రాజ్యాంగ విధానంలో యుక్తవయస్కుడగు ప్రతి సోవియటు పౌరుడు సోవియటులో పాల్గొనవచ్చును. వాక్, నిర్మాణ స్వాతంత్ర్యముండి పనిచేయడానికి, చదువుకోడానికి విజ్ఞానం పొందడానికి అందరికి హక్కు గ్యారంటీ చేయబడింది. మత స్వాతంత్ర్యముంది. ఉదాహరణకు స్త్రీ.పురుషులకు సమాన హక్కులు మాటల్లోనే గాక సమానమైన జీతాలు, జీవితభీమాలు, తల్లి పిల్లలకు రక్షణ, ప్రసూతి సెలవులు, శిశుపోషణ విశ్రాంతి గ్యారంటీ చేయబడుచున్నవి.

సోవియటు యూనియనులో ప్రజలు సోవియట్ల ద్వారానేగాక ట్రేడ్‌యూనియన్లు, సమష్టి వ్యవసాయసంఘాలు, వస్తు విక్రయసంఘాలు, విజ్ఞాన క్లబ్బుల ద్వారా తమ అభిరుచులను తెలియజేస్తూ, పరిపాలనలో పాల్గొంటూ పౌరసత్వ హక్కు లనుభవించుతారు. కమ్యూనిస్టు పార్టీ అన్ని పంథాలలోను నాయకత్వం వహించి, విప్లవ హక్కులను రక్షిస్తూ ప్రజలను నడుపుతుంది. ఈ సంస్థలన్నీ డిమాక్రెటిక్ సూత్రాలపై నడుపబడుతున్నాయి. ప్రజాభిప్రాయం యిటుల అనేక మార్గాల ద్వారా వ్యక్తమయి తన పని నెరవేర్చుకొంటుంది.

సోవియటు యూనియను ప్రపంచమందలి కష్టజీవులందరికి ఆశాజ్యోతి. ఎంత బలవంతులైన నిరంకుశులనైనా పతనమొనరించవచ్చనీ, ప్రజలు సోషలిజాన్ని ఆచరణలో పెట్టగలరని రుజువు చేసింది. బ్రిటిషు సామ్రాజ్యానికి వ్యతిరేకంగా మన పోరాటము ప్రజా ప్రభుత్వం కొరకు; సంపూర్ణ ప్రజా ప్రభుత్వంకొరకు. ఈస్వాతంత్ర్యపోరాటం భారతీయ ప్రజలందరికి సంబంధించినది. కొద్ది మంది ధనికులకు భూస్వాములకు సంబంధించినదేకాదు. అందుచే ప్రజాసామాన్యం నేటినుండి జాగ్రత్తగా వుండాలి. ప్రజా సంస్థలను నిర్మించాలి. తమ వర్గ హక్కులను కాపాడుకోవాలి. పోరాటఫలితాన్ని తమ చేతులనుండి యితరులు గుంజుకొని పోకుండ కాపాడుకోవాలి. అపుడే బ్రిటీషు సామ్రాజ్య వాదులతో రాజీ ప్రయత్నాలు సాగుతున్నాయి. ప్రజా ప్రభుత్వంగాక బూర్జువా ప్రభుత్వాన్ని స్థాపించడానికి ఆలోచనలున్నాయి. ఈ ప్రయత్నాలను మనం విఫలం చేయాలి. మన గొప్ప జాతీయ సంస్థ కాంగ్రెసును ప్రజలందరి నిర్మాణంగా చెయ్యాలి. కాంగ్రెసు జరుపు ప్రజాస్వామిక పోరాటంలో కార్మిక పార్టీ, కార్మిక కర్షక సంఘాలు, ప్రాథమిక కాంగ్రెసు సంఘాలచే సరిగా పని చేయించాలి. వీని ద్వారానే మన సామ్రాజ్య వ్యతిరేక పోరాటం జయప్రద మవుతుంది. తద్వారా వర్గ వైమనస్యం లేని, నిజమైన ప్రజాస్వామిక సోషలిస్టు సమాజం నిర్మించడం సాధ్యమవుతుంది.

# ప్రకాశం కమిటీ సభ్యులకు అభివందన పరంపరలు

## రైతులోకం

తిరువూరు రైతుల సమావేశం

18-12-38 సం॥ రాత్రి 7 గంటలకుతిరువూరు తాలూకా సనిగపూడిశావనాడెంలో చుట్టుపట్ల నాలుగు గ్రామాదుల జమీన్ రైతులు సుమారు 4 వందలమంది కృష్ణాజిల్లా రైతుసంఘ, అధ్యక్షులు కృష్ణాజిల్లా కాంగ్రెసు సంఘముల సహాయకార్యదర్శి అనుమిల్లి పూడి వెంకటేశ్వరరావుగారి యాధిపత్యమున సభ జరిగినది. అధ్యక్షులు ప్రకాశం కమిటీవారి రిపోర్టులోని సూచనలు వచ్చి బిల్లులో చర్చించుటను గురించియు, ఆంధ్రరాష్ట్ర రైతు సంఘమువారి సూచనలను గురించియు నుపన్యసించిరి. ఈమధ్య యీ క్రింది తీర్మానము లేకగ్రీవముగా ఆమోదింపబడెను

1. ఆర్థిక రాజకీయములందు, సర్కారీరైతు లనేక అనేకరెట్లు మెరుగైన యనేకరీతుల బాధపడు జమీన్‌దారీ రైతుల కష్టనష్టముల విచారణగావించి ప్రకాశోర్చి విచారణజరిపినకమిటీ రిపోర్టును బయలుపర్చిన రెవిన్యూ మంత్రి గా॥ ప్రకాశం పంతులుగారిని, వారి యనుచరసభ్యులను, యీ సభవారేకగ్రీవముగా నభినందించుచున్నారు.

2. ఈ బిల్లులో జమీన్‌దారీరైతులతోపాటు సర్వవిధములకా స్వాములైనఅగ్రహారీయీనాం రైతులను విమిదక రక్షణ కలుగజేయుటకును. తేనియడల యీబిల్లును వచ్చువచ్చు తేవి నాటికి వారికి యీరక్షణకలుగు విల్లును వచ్చు వచ్చునట్లు చేయగలందులకును. యీసభవారు రివిన్యూ మంత్రిగారిని కోరుచున్నారు.

3. జమీందారీవిధానమును తొలగించవలయు నని నిరంతరము కోరు రైతుల కోరికను యీ రిపోర్టు నెరవేర్చకపోయినను, ప్రస్తుతఅవసర ములను నెరవేర్చుచున్నందుల కభినందించు చున్నారు. కాని రిపోర్టులోని సూచనలు చాలా నరుకుచిక్కు విల్లులో లోపించుటచేత ప్రయోజనకారిగా కనిపించుచున్నవి. మన ఆంధ్ర రాష్ట్ర రైతుసంఘమువారిచే చేయబడిన సవరణ లను, సూచనలను, సభవారు సంపూర్ణముగా బలపర్చుచూ నీసవరణలను చేర్చి జమీన్ రైతు లకు ప్రయోజనకరముగా శాసనమును చేయ గలందులకే సభవారు రివిన్యూ మంత్రిగారిని ప్రభుత్వము వారిని కోరుచున్నారు.

బిల్లులో జరగవలసిన సవరణలు

11-12-38 తేదీ సాయంత్రం 2 గంటలకు మైలవరం ఫ్లెయ్యి ఆవరణలో, మైలవరం, వంగిగాము, కోడూరు, పంపుమున్కలు, చెవు టూరు మొదలైన గ్రామముల జమీన్ రైతులు మూడువందలమంది ఆంధ్రరాష్ట్ర రైతుసంఘ మేనేజరుగారగు వంమూరి ప్రసాదరావుగారి యాధిపత్యమున సభజరిపిరి. అందు కృష్ణాజిల్లా రైతుసంఘ ప్రచారకార్యదర్శి సుంకర సూర్య నారాయణ, అధ్యక్షులు ప్రసాదరావుగారు స్థ యస్టేట్సుల్యాండు యాక్టు సవరణబిల్లుయందలి విషయములను, ఆంధ్రరాష్ట్ర రైతుసంఘము వారి కోర్కెలననుసరించి, సాకల్యముగా నుపన్య సించిరి. పిదనంతరం యీక్రిందితీర్మానము లేక గ్రీవముగా అంగీకరింపబడినవి.

1. రైత్వారీరైతులకన్న తమింగము హీన స్థితిలో నుండిన జమీందారీరైతుల కష్టనిష్టురము లనుగూర్చి, త్రవుకోర్చి, విచారించి రిపోర్టును బయలుపర్చిన రెవిన్యూమంత్రి గా॥ టంగుటూరి ప్రకాశంపంతులుగారిని, వారియనుచర సభ్యు లను నభినందించుచూ, జమీన్ రైతులతోపాటు అగ్రహార యీనాంరైతులనుకూడా యీబిల్లులో రక్షణ కలుగజేయగలందులకు యీ సభవారు రెవిన్యూమంత్రిగారిని, ప్రభుత్వమును కోరు చున్నారు.

2. జమీందారీ విధానము రద్దుకావాలి యని నిరంతరము రైతులు కోరుచున్న కోర్కెలు రిపోర్టు సూచనలవల్ల పూర్తిగా నెరవేరకపోవు చున్నను, జమీన్‌రైతుల బాధలు చాలవరకు తగ్గుననియు వారి యత్యవసర కోర్కెలు నెర వేరుననియు, యీసభవారు భావించుచున్నారు. అయినను రిపోర్టు నందలి సూచనలకును, చిత్తుచట్టమునందలి నిబంధనలకున్నూ మిక్కిలి తేడా కన్పించుచున్నది. కాబట్టి రిపోర్టునందలి



సూచనలకు అనుగుణముగా, బిల్లులోని నిబంధ నలను సవరిస్తూ, ఆంధ్రరాష్ట్ర రయితు సంఘం వారు సూచించిన సవరణలను యీ సభవారు సంపూర్ణముగా బలపరచుచూ, వాటిననుసరించి బిల్లును సవరించి రయితులకు ప్రయోజనకర ముగా నుండునట్లు చేయగలందులకు రెవిన్యూ మంత్రిగారిని, ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

ప్రకాశం కమిటీ నివేదికను బలపర్చాలి.

13-12-38 వ తేదీని చెన్నకొమ్ముపాలెం లో జరిగిన బహిరంగ సభలో గుజ్జుల రామి రెడ్డిగారు, రైతు లందరూ కలసి యీ జమీం దారీ బిల్లు వచ్చేవరకు తీవ్రమైన ఆందోళన చేయవలెనని చెప్పిరి. తరువాత వానిరెడ్డి నారా యణరావుగారు జమీందారీ విచారణ కమిటీ రిపోర్టులోని ముఖ్య విషయములను తెలియ పర్చి, రాష్ట్ర రైతు సంఘమువారి సూచనలను తెలియజేస్తూ బిల్లు త్వరగా వచ్చేటట్లు వత్తిడి చేయవలెనని రైతులను హెచ్చరించిరి ప్రకా శం పంతులుగారి రిపోర్టును బలపరుస్తూ జమీం దార్లు చేయు కుట్రలను గురించి చెపుతూ, యీ బిల్లు వచ్చేవరకూ రైతులు, పిటీషన్ల ద్వారా, ఊరేగింపుల ద్వారా, తీవ్రమైన ఆందోళన చేయ వలెనని కోరిరి. జయజయధ్వానములతో సభ ముగిసెను.

రైతులలో ఆందోళన చేయాలి.

డిశంబరు 9 వ తేదీని బ్రాహ్మణగూడెము గ్రామములో కొవ్వూరు తాలూకా కాంగ్రెసు రైతుసంఘముల సంయుక్త సమావేశము జరి గినది. ఈ క్రింది తీర్మానములు ఏకగ్రీవముగా ఆమోదింపబడెను.

1. మదరాసు ఎస్టేటు ల్యాండు ఆక్టు బిల్లు నువిశేష శ్రమ కోర్చి రైతులోకమునకు మహోప కారిగా తయారుచేసిన శ్రీ గా॥ ప్రకాశంపంతులు గారిని యీ కమిటీవారు అభినందించుచున్నారు.

2. ఎస్టేటు ల్యాండు ఆక్టు బిల్లు చట్టమగు లోపున, దానిని విచ్ఛిన్నము చేయుటకున్నూ, తమ కనుకూలముగా మార్పుచేయించుటకునూ జమీందార్లు తమ సర్వస్వమును వినియోగించె దరు. గానసదరు బిల్లు ఏవిధమైనమార్పులు చెంద కుండా చూచుటకున్నూ, ఇంకను రైతులకు లాభకరమైన మార్పులు చేయుటకున్నూ, రైతు లోకమున గొప్ప ఆందోళన జరుపవలసిన అవ సరమున్నది గాన, తాలూకా రయితు సంఘ సహకారముతో ఈ క్రింది ఉపసంఘ సభ్యులను ఏర్పరచుటకున్నూ, ఇందుకగు ఖర్చులకు గాను 30 రూపాయలు తాలూకా కాంగ్రెసు సంఘము నుండి శాంక్షను చేయుటకును తీర్మా నించడమైనది.

దాట్ల సూర్యనారాయణరాజుగారు(కన్వీనరు)
అబ్దుల్ మజీద్‌ఖాన్‌గారు
ఆత్కూరి అమ్మిరాజుగారు
అడ్డాల అరవాలుగారు
పి. యస్. రామచంద్రరావుగారు
కొండేపాటి సుబ్బన్నగారు

జమీందారిణీగారి మూర్ఖత్వం

గన్నవరం యెస్టేటు రాణిగారికిని అడవి నెక్కలము రైతులకును, చాలరోజులుగా అడ వినిగురించి వ్యవహారములు జరుగుచున్నవి. అడవికి యింజంక్షను కూడా యిచ్చియున్నారు. యీవిషయమిదివరకే పాఠకలోకము పత్రికలలో చూచియున్నారు. ఇప్పుడు వెలువడిన యెస్టేటు ల్యాండు ఆక్టు సవరణ బిల్లు సదరు రయితులకును, జమీందారు లకును అడవియందు ఎంత హక్కున్నదీ విశదముగా తెలియపర్చినను రాణీగారి మూర్ఖ త్వము హెచ్చుమీరిగ, పోలీసుతో యీస్టు మైల వరం యెస్టేటు యిలాకా కండ్రిక రయితులకు అడియాసలు కల్పించి, రయితులమధ్య వివా దలు పెంచుచుండుట, యీ అమాయకరయి తులు పేరాసకు లోనై తమ కర్తవ్యమును గుర్తించకుండుట, శోచనీయము. స్వాభావికా యముగానై రాణీగారు అవనమెుక్కులు గ్రొ క్కిన గ్రొక్కి నప్పు. తరతరములనుండి జమీం దార్ల నిరంకుశ నిజాయితీలను, వారు రయితులకు చేయు అక్రమములను తెలుసుకొనక పండిన పంటపన్నులక్రింద నిచ్చు రయితులోకము రాణీ గారి సూచనలను విశ్వసించుట మిక్కిలి విచార కరము.

మొఖాసాదార్ల అక్రమాలు

నూజవీడుతాలూకా, పొలసానిపల్లిగ్రామంలో సమ్మె యింకా జరుగుతోంది రయితులేమాత్రం లొంగడంలేదు. మిక్కిలి సహనముతోఉన్నారు, మొఖాసాదార్లయిన వెలమదొరలు రయితుల నేవిధంగాఅయినా దెబ్బగొట్టుటకు రయితుల వాకిళ్లముందు, యిండ్లముందు, ఉన్న రయితుల గొడ్లుకములు ఎత్తుకొనిపోతున్నారు. అయినా రయితులు ఏమి కలుగజేసుకొనడంలేదు. ఊరి యందున్న మాదిగలు పనికిరాక సమ్మెకట్టుట వల్ల లింగాల గ్రామమునుండి దేవరకోట భూషయ్యఅనేమాదిగవానిని పిలిపించుకొన్నారు. ఒక రిద్దరు పొరుగువారినికూడ పెట్టుకున్నారు, దీనికి సహించజాలక ఉప్పరులు కొందరు ఆ మాదిగను పొమ్మనుటకై సన్నాహముకాగా యితర మాదిగలు వారించిరి.

రయితులు లొంగుబాటుకు రానందున, మొఖాసాదార్లు ఇదివరలో పెట్టిన పెట్టుబడులకై క్లెయింట్లు చేసి రయితుల మీద ఒత్తిడి కలిగిం చుచున్నారు. రయితులకు—మొఖాసాదార్లకు మధ్యగల ఈవైషమ్యముల నాధారం చేసుకొని, కనికిపర్ల అంజనేయులు అనే కోమటి తన సరి హద్దు రాతిని జరిపి, అదేమి అని అడిగితే పచ్చణ బయల్దేరినది. అంజనేయులుగారు రయి తులపై ఛార్జి యిచ్చారు. ఇందులో మొఖాసా దార్ల ప్రోత్సాహం కలదనియు, ధన సహాయం కూడా చేస్తున్నారనియు, తెలియుచున్నది.





# మన సహకార సంఘాలు

## ప్రజలకు సాయపడాలంటే ఏమిచెయ్యాలి?

(గత సంచిక తరువాయి)

మధ్య తరగతివారగు గుమాస్తాలు ఆఫీసు లో పనిచేయువారలకు నిర్మించు సంఘములలో నున్నతోద్యోగులు, ఉన్నత స్థానము నాక్ర మించు పద్ధతిని దీసివేయవలెను. ఉన్నతాధి కారులను, యజమానులను, తమ క్రింద పని చేయు వారికి, నిర్మింపబడిన సంఘములలో ఉన్నత స్థానములు, ప్రత్యేక హుకుటు వలన అట్టి సంఘములు. ఈ ఉన్నతాధికారుల, నియంతృత్వములకు, లోబడి పని చేయవలని యుండును. సమ్మె చేసినపుడు సంఘమువారికి, అప్పులను, సరకులను, లెక్కలలో ఖర్చుగా వ్రాని యిచ్చుటయు, సభ్యుల ప్రాథమిక హక్కుగా శాసింప బడవలెను. సంఘముల లోనిసాముదాయక ప్రయోజన నిధి,సమ్మెదార్లకు యిచ్చుట, యొక క్రమమైన పద్ధతిగా శాసింప బడవలెను. 1932 లో జరిగిన యం. యస్. యమ్. రైల్వే సమ్మెలో, ఈ రైల్వే పనివారల సహకార సంఘము, సమ్మెదార్లకు. సరకుల ను. వెచ్చమునకిచ్చు పద్ధతిని అప్పటికప్పుడు నిల్పివేసెను. ఆ రైల్వే పనివారల సహకార బ్యాంకులోని, సాముదాయక ప్రయోజన నిధి, సమ్మెదార్ల సహాయముగ నియ్యబడవలెనని తీర్మాన మా బ్యాంకుయొక్క మహాసభ వారు ప్యాసు చేసినను, ఆ తీర్మానము చెల్లదగినది కాదని నిర్ణయింపబడెను.

సహకార సంస్థలలో పని చేయువారికి సరియైన జీతముల నిచ్చునట్లును, పనిచేయు గంటల నిర్ణయించుటకును, వారి యుద్యోగ భద్రతను కాపాడుటకును, సెలవు మున్నగు వాటిని గూర్చి తగిన నిబంధనలను ప్రభుత్వము శాసించవలెను. సహకార సంఘములకును, రైతు సంఘములకును, అన్యోన్య సంబంధ ములు హెచ్చుగా కలిగియుండుటకు తగిన ఏర్పాటు లొనర్పవలెను. వారి యాందోళన లోను, వారి కార్యక్రమములలోను సహకార సంఘములవారు పాల్గొనుటను ప్రోత్సహించ వలెను. ఈ సంయుక్త సమావేశములు నిషే ధింపబడనే కూడదు. ఇటులనే కూలీల సహ కార సంఘములనును, కూలీల సంఘముల కును పై విధముగా నన్యోన్య సంబంధము లుండుటను ప్రోత్సహించవలెను.

సహకార సంస్థలు అన్ని దేశములలోను ఫాసిస్టు దేశాలలో మినహాగా-యుద్ధ వ్యతిరేక ఉద్యమంలో పాల్గొంటారు. మనదేశంలో కూడా యుద్ధ వ్యతిరేక వుద్యమములో సహకార సంఘాలు పాల్గొనునట్లు చేయాలి. ఈ సహ కార సంఘమే, శాంతి సభల సమావేశము. ప్రారంభించేటట్లు తగిన కట్టుబాట్లు చేయాలి. ఆ విధముగా, సంఘాలు శాంతికై జరుపు ఉత్సవాలకి, ఏమైనా ఖర్చుపెడితే, ఆ ఖర్చు అత్యంత క్రమమైన ఖర్చుగా పరిగణింప బడాలి.

ఈ పై సూచనల రీతిన సహకారోద్యమం నడిపితే మన దేశంలోని పీడితవర్గం ఉన్నత స్థితిని పొంది, యుద్యమానికి సహకారిగా ఉండగలను. అట్లుగాక యిప్పుడు జరుగుచుండు పద్ధతుల మీదనే సహకారోద్యమము నడువ బడి, ఏవో కొన్ని కార్యక్రమమందలి మార్పులు చిల్లర సంస్కరణలు, మొదలగు వానితోను, అతుకులు వేసిన రీతిని, ఉద్యమమును నడపిన యెడల అక్రమముగా ఈఉద్యమము తనయొక్క లక్షణములు, ఏ మాత్రమైన లేక పూర్తిగా సామ్రాజ్య తత్వమును బలపరచునట్టి ప్రభుత్వ శాఖగా మారిననుటలో సందియమే లేదు, మంత్రివర్గము, ఈ గొప్ప యవకాశములతో నడుపదగు ఉద్యమమును, సంకుచితమగు, నియంతృత్వపు యంత్రము వలెనే మార్చివే యక, బ్యాంకుల యొక్కయు, జాతీయతలేని ధనికవర్గము యొక్క, దేశద్రోహకరమగు సలహాలను, ఉద్దేశములను సరకుగొనక, ఈ ఉద్యమమును ప్రజా యుద్యమముగను, ప్రజా శయములను నెరవేర్చుట కనుసరించు యుద్య మముగను, చేయుటకు తగిన మార్పులు చేసి ననే, సహకారోద్యమము, సోవియటు రష్యా దేశమందును, స్పెయిను ప్రభుత్వపు ప్రాంత ములలోను వృద్ధిచెందినట్లు ప్రజా యుద్యమమై ప్రజాశయములకు తోడ్పడగలదు.

ఇక సహాయకారోద్యమము, విద్య గరపు విద్యుక్త విధిని యేమాత్రము నెరవేర్పలేదు. ఈ సహకారోద్యమము జరపు ప్రచారమును, వీరు సహకారసంఘ సభ్యులకు గరపు విద్య చాల ప్రాథమికావస్థలో నున్నది. ఈవిద్యావిధా నముకు ప్రచారమును, ప్రభుత్వోద్యోగియుల యొక్కయు, బ్యాంకుల డైరక్టర్ల యొక్కయు, ఇష్టప్రకారము నడుపబడుచున్నది. ప్రచారకు లను, ఉపన్యాసకులను, నియమించువారు ఈ విజాతీయ ధనికవర్గపు ప్రతినిధులై, వీరిచే నియమింపబడిన వారు ప్రభుత్వోద్యోగియులచే సమ్మతింపబడిన వారుగా నుండవలెను. అందు వలన జాతీయాశయములు గల్గినట్టివారు గాని, ఉన్నతాదర్శకులు గాని ప్రచారకులుగానిర్ణయింప బడరు. ఇందువలన నీ సహకార ప్రచారమను పేరుతో జరుపబడు ప్రచారము, కేవలము బ్యాంకు లిచ్చిన అప్పులను తిరిగి క్రమముగా చెల్లించుట నాదేశించుచు నుపన్యసింపడు నుద్దేశములే, యీ ప్రచారకులు ప్రజలకు గఱపు చుందురు. అప్పులు క్రమముగా తీర్చివేయు నుద్దేశములు నెరవేరుటకై సహాయపడునట్టి మానవ నడవడిని, గుణములను పెంపొందింప జేయుటకే యీ ప్రచార ముపయోగింపబడుచు న్నది. వీరి ప్రచారము తీసిన యప్పులు క్రమ ముగా చెల్లించుటయే, మానవ గుణములలో నాదర్శప్రాయమైన సద్గుణము అని అందువలన బ్యాంకులకు లాభము కలుగజేయుటయే ప్రధా నాదర్శముగా నుంచుకొని, అట్టి యుద్దేశ్యము నెరవేర్చుటకై యొనర్చు ప్రచారమే యీ సహ కార విద్య, సహకార ప్రచారమై, ప్రజలకు గరుపబడుచున్నది. అంతర్జాతీయ సహకారో ద్యమము యొక్క చరిత్రను గూర్చి తెలుపరు. రాజకీయ తాటస్థ్య మవలంబించుటచే సహకార సంఘములు, దేశమందలి ఫాసిస్టు ప్రచారమున కేవిధముగా మార్గదర్శకులై, ఫాసిస్టుల కుట్రలను వారి పన్నాగములను సఫలమౌట కెవిధ ముగా, సహాయము చేసినవారై నదియును, ఈ ప్రచారకులు తెలుపరు. ఈవిధముగా ప్రజలలో రాజకీయ తాటస్థ్యమును చాటి, ఒకవిధమగు కృత్రిమమైన భద్రతను (Sense of false security) అలవాటు చేసి, కార్మిక ఆశయములనెల్లు వ్యతిరేకముగా ప్రవర్తించిరో, దానింగూర్చి తెలుపరు. ఫాసిస్టు విజృంభణము వలన సహకారులు నేర్చుకోవలసిన గుణపా ఠము దెలుపుటలేదు. సహకారము పెల్లగా పెట్టుబడిదారీ విధానము నంతను అతిక్రమింపగల దను నిరాధార మగు వాదము యొక్క బూటక మును, ఏవిధముగా లోకమంతయు నావరించిన ఆర్థిక మాంద్యము స్పష్టపరచినదియు దెలు పరు. సోవియటు యూనియన్‌లో, ఆదర్శప్రా యముగా నెల్లు సహకారోద్యమము వృద్ధిచెందు చుండినదియు, దెల్పబడుటలేదు. సోవియటు చైనాలో గాని, ప్రజా ప్రభుత్వముచే పరిపాలింప బడు స్పెయినులో గాని, సహకార సంఘము లెట్లువృద్ధి చెందు చుండినదియు చెల్ప బడుటలేదు. అంతర్జాతీయ సహకార సమ్మేళ నము, శాంతినిగూర్చి జేసిన తీర్మానమును గూర్చిగాని, స్పెయినులోని యుద్ధములో ప్రజా స్వాతంత్ర్యమును రక్షించుటకై తమ శరీరము లను ఫాసిస్టు తుపాకుల గుండ్ల కప్పించి పోరాడుచున్న స్పెయిను వీరులకు సహాయము చేయుట కనీస ధర్మమని దెల్పిన, అంతర్జా తీయ సహకార సమ్మేళనముయొక్క తీర్మా నము మన దేశపు సహకారులకు దెలుపువారు లేరు. ప్రభుత్వాధికారులు గాని, మన జాతీయ సహకార నాయకులుగాని యిట్టి ప్రచారము జరుపనివ్వరు. ఈ నాయకులకు సహకారమని న ఏమియు దెలియదు. కార్మిక కర్షకాశయ ములు వీరికేమాత్రము సరిపడవు. ఈ విధంగా ప్రాథమిక జ్ఞానముతోను, అంధకారముతోను నున్న యుద్యమముతోని ప్రచారము విద్యయు క్రమముగా జరుగవలెనని, ఆర్థిక శాస్త్రముం గూర్చియు కార్మికోద్యమముం గూర్చియు సోవియటు యూనియను గూర్చియు, మార్క్సు సిద్ధాంతములను గూర్చియు తెలుసుకొన్న వారే యీ సహకార ప్రచారమును నడుపువారుగా యుండవలెను.

మన దేశములోని కార్మిక కర్షకుల కనీసపు కోర్కెల గూర్చియు, రైతు సంఘముల పోరా టము, వాని యుద్దేశ్యము దెలిసికొని మన దేశము యొక్క ఆర్థిక పరిస్థితులు గ్రామముల యొక్క యవసరములు మున్నగు వివిధ విష యముల గూర్చి తెలిసికొన్నవారే ఈ సహకార ప్రచారమునకు నియమింపబడవలెను. సహ కార సిద్ధాంతములను సహకార ప్రచారము దెల్పవలెను, రాజభక్తులను, వ్యతిరేక జాతీయ ధనిక వర్గము యొక్క యనుచరులను వృద్ధి చేయుటకును, ఆకలితోను నిరుద్యోగముతోను బానిసత్వముతోను క్రుంగిపోవు రైతును మరింత క్రుంగదీయు విధానమును ప్రోత్స హించుటకీ ప్రచారము నడుపబడగూడదు.

సహకారోద్యమ సంస్కరణము, ప్రజాందో ళన చేయకున్న, గలుగనేరదు. సహకారముపై గొప్ప నియంతృత్వపు కట్టుబాట్లు గలుగజేయు టయు, సహకారము ప్రజా యుద్యమముగా నిర్మింపక కేవలము, విజర్వు బ్యాంకుల యొక్కయు, ప్రభుత్వము యొక్కయు, విజా తీయ ధనిక వర్గము యొక్కయు, సాజ్ఞల ననుసరించి నడుపబడుట, బ్రిటిషు సామ్రాజ్యం మన దేశమును బంధించివేయు, విధానములో నొక అంగభాగమే. ఈ బంధనముల నుండి విముక్తిజెంది మనదేశము స్వతంత్రతను సంపా దించు వరకును, ఈ సామ్రాజ్యవాదము, పార ద్రోలబడు వరకును ఈ ఉద్యమం ప్రభుత్వము యొక్క నియంతృత్వమునకు లోబడి పనిచేయ వలసి వచ్చును. అంతవరకును కార్మిక కర్షకు లకు తగినంతమేలు కలుగజేయ వీలులే కుండును. అందువలన, ఈ యుద్యమమువలన ప్రజలకు మేలుగల్గి, యీ యుద్యమము ప్రజా యుద్యమమై యుండవలెనని, ప్రభుత్వ బంధ నముల నుండి విముక్తి జెందుటకు సహకార సంఘసభ్యులెల్లరును, ఆందోళన జరుపవలెను. ఆ యాందోళన మన దేశమునకు, స్వాతం త్ర్యము వచ్చుటనే లక్ష్యముగా నుంచుకొన వలెను. అప్పుడు కాని యీ సంఘములు, సరిగా పనిచేయుటకు గాని, దేశములోని నొత్తు దేశప్రజలకు చెందు నవకాశముగాని, పూర్తిగా కలుగదు. అందువలన కాంగ్రెసువారు, రైతు సంఘములు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు, ఇతర సామ్రాజ్య వ్యతిరేకులు, సహకారోద్య మము ప్రజలయొక్క, దైనందిన పోరాటము లలో పాల్గొనుటకును, వారికి సహాయముచేయు నట్లును వీలగు నిర్మాణము కలిగినవిగా ఉండు నట్లు వీరాందోళన సాగింపవలెను, వీరు కార్మిక కర్షకుల జీవితావసరముల కెన్నియో విధముల తోడ్పడునట్లు సహకారోద్యమము నడుపవలెను. అట్లు నడిపి ప్రజా పోరాటములో పాల్గొని, అభి వృద్ధి పొందినపుడే, సహకారోద్యమము నిజమైన జాతీయోద్యమముగను,అప్పుడే నిజమగు సహ కారోద్యమము, దేశములో విరాజిల్లుచుండ గలదు.

# యూరపులో దుష్ట చతుష్టయం

## నాలుగు రాజ్యాల ఒడంబడికకు చాంబర్లేను యెత్తులు

గతవారము నాలుగు రాజ్యాల ఒడంబడిక కోసం యూరపులో చేసే ప్రయత్నాలు పరిశీలించాము. ఇది సోవియటు యూనియనుపై దాడి వెడలడానికి మొదటిమెట్టు అనికూడ సూచించాము. ఈ వారములో ఈ నాలుగు రాజ్యాల (ఇంగ్లండు ఫ్రాన్సులు; జర్మనీ ఇటలీలు) సంబంధాలేవిధంగా మార్పుచెందినవి పరిశీలిస్తాం.

### జర్మనీ

ఆస్ట్రియాను మ్రింగింది. జెకోస్లొవేకియాను ఛిన్నాభిన్నము గావించింది (పటములో నూతన జెకోస్లొవేకియాను చూడుము) అంతటితో ఆగలేదు. చర్చిలు ఒక ఉపన్యాసంలో చెప్పినట్లు జర్మనీ నేడు సులభంగా ఆక్రమించుకోడానికి వీలైన దేశాలు చుట్టూ చాలాఉన్నాయి. హంగరీ ఉంది. పడమట బెల్జియమునకు యుద్ధానంతరం వచ్చిన జర్మనీ భూభాగముంది. ఉత్తరాన పోలండుకు ఇవ్వబడిన డాన్జిగ్ కారిడర్, డాన్జిగు ఉన్నాయి. మెమిల్ఉంది. రుమేనియామీదుగ సోవియటు యుక్రెయిను ఉంది. వీనిలో దేనిని కబళించాలో నిర్ణయించుకోడానికి హిట్లరు నేడుబాధ పడుతున్నాడట; కాని హిట్లరు త్వరలోనే నిర్ణయానికి వచ్చాడు;

స్విట్జర్లండును, మెమెలును, ఆక్రమించుకోవాలి; రుమేనియామీదుగ యుక్రెయినును ఆక్రమించుకోవాలి;

స్విట్జర్లండులో ఫ్రెంచి, ఇటాలియను, జర్మనీ భాషలు మాట్లాడేవారున్నారు. ఇవి స్వతంత్ర రాజ్యాలుగ (కాంటనులని వీనిని పిలుస్తారు) ఉంటూ, ఒక ఫెడరలుసమాఖ్యలో చేరిఉన్నాయి. జర్మనీభాష మాట్లాడే భాగాలన్నిటిని జర్మనీలో కలుపుకోడానికి; బెర్న్ (స్విట్జర్లండు యొక్క ముఖ్యపట్టణము) లో జర్మను రాయబారివర్గమునకు చెందిన విక్రాను నియమించాడని వదంతులు వ్యాపించాయి. ఎక్కువ జర్మనీ ఆందోళనను అణచడానికని స్విట్జర్లండుప్రభుత్వం కొన్ని ప్రత్యేక శాసనాలు చేసింది.

### జర్మనీ మెమెలు

లిథూనియాకు ముఖ్యపట్టణము ఒకప్పుడు విల్నా. కాని గతప్రపంచ యుద్ధానంతరముదీనిని పోలండుబలవంతంగాలాగుకొంది. పెద్ద రాజ్యాలవారు చూచి చూడనట్లు ఊరకున్నారు. దానితో కినిసి, లిథూనియా అప్పుడు జర్మనీకి చెందిన మెమిలు పట్టణాన్ని తానాక్రమించుకుంది. ఈ ఆక్రమణను పెద్ద రాజ్యాలవారు అంగీకరించారు. ఈఅంగీకారపుటొడంబడికకేమెమెలుస్టాట్యూట్ అంటారు.

ఈ మాసము ఈ మెమెలు పార్లమెంటుకు ఎన్నికలు జరిగాయి. 1935 ఎన్నికలలో జర్మనులు తమ ఎన్నిక ప్రచార పత్రాలుకూడ పంచి పెట్టకూడదని శాసించిందిలిథూనియా ప్రభుత్వం. అయినప్పటికి 29 స్థానాలలో 24 స్థానాలుజర్మనులకే వచ్చాయి. అప్పట ఒక విధమగు సైనిక శాసనము అమలులో ఉంచింది లిథూనియా ప్రభుత్వము. కాని మొన్న హిట్లరు జర్మనీ ఒత్తిడివలన సైనిక శాసనాన్ని రద్దుకావించింది. ఎన్నిక ప్రచారముకూడ చేసుకోవచ్చునన్నది. అంతేగాక ఒక 5000 మంది లిథూనియా ప్రజలకు ఓటు హక్కుకూడ లేకుండచేసింది. మెమెలు జర్మనులు నేషనలు సోషలిస్టు పార్టీ అనే పేరుతో ఎన్నికలలో పాల్గొన్నారు. తిరిగి జర్మనీలో కలసిపోతామని ప్రచారముచేశారు. మెమెలు జర్మనీ నాజీలనాయకుడు డాక్టరు నెక్లిన్ ఈ ఎన్నికలలో నూటికి 87 మంది నాజీ పక్షానికి ఓటుచేశారు. 29 స్థానాలు జర్మనులకు లభించాయి. మెమెలు స్టాట్యూట్‌నురద్దుచేయాలని జర్మనీ పత్రికలు ఆందోళన ఆరంభించాయి. లిథూనియా అధ్యక్షుడు, చిన్నజాతులన్నీ చాల జాగ్రత్తగా ఉండాలని ఈ ఆందోళనకు భయపడి ఒక అపీలు చేశారు. అంతేగాక పోలండు ఈవరకు విల్నాను లాక్కొంది అనే పగను మరచిపోయి, దానితోస్నేహితాన్ని సంపాదించుకోడానికి ప్రయత్నాలు చేయసాగారు. వర్తకపు టొడంబడికకూడ త్వరలోనే కుదురుతుందట;

### జర్మనీ : పోలండు

రుథూనియాను స్వతంత్ర రాష్ట్రంగా చేస్తే తన దేశములోని యుక్రెయినులుకూడ స్వాతంత్ర్యాన్ని కోరుతారేమోనని పోలండు రుథూనియాను హంగరీకి ఇప్పించడానికి ప్రయత్నించింది. కాని ఆ ప్రయత్నాలు భగ్నమయినవి. దాని ఫలితంగా జర్మనీకి వ్యతిరేకంగా రష్యాతోను, లిథూనియాతోను పోలండు దగ్గర సంబంధాలను ఏర్పరచుకోడానికి ప్రయత్నిస్తూ ఉంది.

ఈ మధ్యనే రుథేనియాలో పోలండుకు వ్యతిరేకంగా ప్రచారము చేస్తూవుంటే పరిస్థితులు విషమిస్తాయి సుమా అని జెకోస్లొవేకియా ప్రభుత్వాన్ని పోలండు హెచ్చరించింది.

కాని నేడు జెకోస్లొవేకియా నూతన ప్రధాని బిరన్ జర్మనీతోటి సంబంధాలను జర్మనీ కనుకూలంగా ఉంచేటాగున ఏర్పరచుకుంటున్నాడు. ఇది తప్పనిసరి యని కూడ అంటున్నాడు. అందుచేతనే జెకోస్లొవేకియాకు ఉత్తరమున జర్మనీలోనున్న బ్రెస్లావుండి, దక్షిణాన జర్మనీలోనున్న వియన్నా వరకు ఒక రస్తాను జర్మనీ నిర్మించడానికి ఒప్పుకున్నాడు. ఈరస్తా జర్మనీ ప్రభుత్వానికి చెందిన జర్మనీ దేశములో ఒక భాగంగా పరిగణింపబడుతుంది. ఈ రస్తా జెకోస్లొవేకియాలోని బొహిమియాను (జెక్ భాషను మాట్లాడే ప్రజాసామాన్యాన్ని) స్లొవేకియానుండి వేరుచేస్తుంది.

ఇంతేగాక జెకోస్లొవేకియా పడమటి భాగములోనుండి ప్రేగునుండి రుమేనియా సరిహద్దువరకు మరియొక మోటారు రస్తాను నిర్మించడానికి జర్మనీ చెప్పగానే జెకోస్లొవేకియా ప్రభుత్వము పూనుకుంది. ఈవిధంగా జర్మనీ యుద్ధయంత్రములో ఒక భాగమయి పోయిన జెకోస్లొవేకియా ప్రభుత్వంతో పోలండు కంప్లయింటు చేస్తే మాత్రమేమి లెక్క.

ఈ కంప్లయింటును జర్మనీ లెక్కచేయక స్వతంత్ర యుక్రెయినును ఏర్పరచడానికి బెర్లినులో ఒక నాజీ పార్టీ శాఖను ఏర్పరచారు. ఈవరకు 1917 లో యుక్రెయిను సైన్యానికి చెందిన మస్కో అనునతని దీనికి నాయకుడుగా చేశారు. అప్పుడే జర్మనీలో ఉన్న 40 వేలమంది యుక్రెయిను భాషను మాట్లాడేవారిని ఒక సైన్యంగా ప్రోగుచేశారు.

దీన్నిబట్టి చూస్తే హిట్లరు జర్మనీ ఎత్తు పోలండు యుక్రెయినుపై తదుపరి సోవియటు యుక్రెయినుపై దాడి వెడలడానికి తయారు చేసుకుంటూ ఉన్నట్లుంది.

జర్మనీ ప్రాబల్యములోకి రాకుండా ఉండడానికి రుమేనియా ఇంకనూ ప్రయత్నిస్తూ ఉంది. రుమేనియను నాజీపార్టీ నాయకులకు కెరోలురాజు కఠిన శిక్షలు విధిస్తూనే ఉన్నాడు. అంతేగాక మిగిలిన రాజకీయ పక్షాలన్నింటిని రద్దుచేసి "నేషనల్ రినైసాన్సు" పార్టీ ఒక్కటే ఉండాలని ఒక శాసనం ప్రకటించాడు. జర్మనీ నాజీ ఒత్తిడిని ఎదుర్కొనడానికి రుమేనియా రాజు తాను నాజీ విధానాన్ని అవలంబిస్తున్నాడు. ఇది నిష్ప్రయోజన మవుతుంది. జర్మనీని ఎదుర్కొనడానికి మార్గము, ప్రజాసామాన్యానికి ప్రజాతంత్ర హక్కులను విరివిగానిచ్చి వానిని కాపాడుకోడానికి పూనుకొనేటట్లు చేయడమే. కాని రుమేనియా అలా చేయడములేదు. ప్రస్తుతము అవలంబించే విధానము జర్మనీ ప్రాబల్యానికి దారితీయడమే తప్ప వేరేమి కాదు.

### జర్మనీ : ఇంగ్లండు

ఈ జర్మనీ ప్రాబల్యం మరియొక దిశలో ఏలాగుఉందో చూతము. కాలనీలు తిరిగిఇమ్మని హిట్లరు ఆందోళన చేస్తూనేఉన్నాడు. ఇంగ్లండు నైజీరియానుగాని, మరెట్టి కాలనీలనుగాని జర్మనీకి ఇవ్వనని ఛాంబర్లేను కామన్సు సభలో పలికాడు. దేశములో తన విధానానికి ఉన్న వ్యతిరేకత ఆతనిచే ఈలా పలికించింది. ఇం గ్లండులోని బూర్జువా వర్గములోనే, (ధని వర్గములోనే) శాసన వర్గములోనే చీలిక ఏర్పడ్డాయి. ఈడెన్, డఫ్‌కూపరు, చర్చిల్ వీరేగాక లండన్డరీ ప్రభువుకూడ ఈ వి నము నిష్ప్రయోజన మన్నాడు. ఛాంబర్లే పైనచెప్పిన వాక్యానికి ఎట్టి విలువలేదని.

కామన్సు సభలో ఒక ప్రశ్నకు జవా చెప్పుతూ, పార్లమెంటుతో చర్చించనిదే ఇత దేశాలతో కాలనీలు తిరిగి వాటికిచ్చివేయడా సంప్రదింపులు ఆరంభించను అని హామీ ఇవ మని కోరినప్పుడు అట్టి హామీ ఇవ్వ నిరా రించాడు.

ఫ్రెంచి పత్రికా విలేఖరి పెర్టినాక్సు, ముసో లినీతో ఛాంబర్లేను సంప్రతింపులకు పో నప్పుడు, అబిసీనియాకు దక్షిణాన సముద్రతీరా ఉండే బ్రిటిషు సోమాలిలాండును ఇటలీకి ఇచ్చి వేస్తాడని, దానిని ఆనుకొని ఉండే ఫ్రెం సోమాలిలాండును, జిబోతి — అడిస్ అబాబా రైలు మార్గాన్ని (అబిసీనియా రైలుమార్గాన్ని ఫ్రాంసు ముసోలినికి ఇవ్వడానికి ఒప్పు ఒప్పుకొనేటట్లు చేస్తాడని, ఒక వార్తను వె బుచ్చాడు.

#### ఫ్రాంసును బెదరిస్తున్నారు

అంతేగాక, ఫ్రెంచి దేశస్థులను భయపె దలదీయ, బోనెట్ మంత్రివర్గము అధికారము లోనే ఉండేటట్లు చూడాలని జర్మనీ ఇటలీ ఎత్తులు. జర్మనీ ఫ్రాంసుతో "ఇకముందు ప స్పరం యుద్ధము చేయవనే" ఒడంబడిక చేస కుంది. ఈ ఒడంబడికతో ఫ్రాన్సు ఇంగ్లండ పలుకుబడిలోలేక తన పలుకుబడిలోకి వస్తుం దని ఒక ఆశ. రెండవది బోన్నె తన పూ కార్యమనుకొని ప్రకటించుకోడానికి వీలవ తుంది.

ఇటలీ తనకు టునీసియా, కార్సికా, నైస్ కావాలంటూ ఆందోళనను సాగిస్తూనే ఉంది.

ఇన్ని జరుగుతూ ఉన్నప్పటికి ఛాంబర్లేను కామన్సు సభలో ఒక ప్రశ్నకు జవాబుచెప్పుతూ



ఇటలీ ఫ్రాంసుపై దండెత్తితే, ఫ్రాంసుకుసాయం చేయవలసిన అవసరములేదని, అట్టి ఒడంబడికలేమీ లేవనిచెప్పాడు. ఫ్రాంసును నట్టేటముంచదలచాడని ఫ్రెంచి పత్రికలు గోల పెట్టాయి. ఇంగ్లీషు పత్రికలుకూడ జవాబును తెలివితక్కువ అని అన్నాయి. ఛాంబర్లేను తెలివితక్కువవాడు కానే కాడు. అతనిభావం స్పష్టమే. ఫ్రాంసులో ప్రస్తుతపు ధనికవర్గ ప్రభుత్వము ఊడిపోతే, ఒక అతివాద ప్రభుత్వము వస్తే నాలుగు రాజ్యాల ఒడంబడిక భగ్నమయిందన్నమాట; ఇటలీ కోరిన గొంతెమ్మకోర్కెలు తీర్చడు. స్పెయినులో రిపబ్లికు ప్రభుత్వానికి ఆహారసామగ్రిని అణచివేసి నాశనము గావించడానికి సాధ్యం కాదు. ఇప్పుడున్న దలదీయ ప్రభుత్వమేఉంటే ప్రస్తుతము ఫ్రాంసులోనున్న ప్రతిఘటనాభిప్రాయాన్ని క్రమేణ అణచివేసి, ఈ ఎత్తుల నన్నిటిని నిర్విఘ్నముగా కొనసాగించవచ్చును. నాలుగు రాజ్యాల ఒడంబడికను తీసుకరావచ్చును. ఫ్రాంసు తనపై ఆధారపడి ఉండేటట్లుచేసిజర్మనీ పోటీకి ఆగవచ్చును. జర్మనీతో తనకు అనుకూలమైన షరత్తులతో ఒడంబడిక కుదుర్చుకోవచ్చు. ఛాంబర్లేను "ఫ్రాంసుకు సహాయము చేయ నవసరములేదన్న ప్రకటనకు అర్థమిది.

ఇదే కానిచో, దీని పిదప, విదేశ పత్రికా విలేఖరుల అసోసియేషనులో ఉపన్యసిస్తూ ఛాంబర్లేను ఈలా అన్నాడు. "ఫ్రాంసుతో, ఎట్టిలిఖిత ఒడంబడికలు లేకపోయినా, మాలాభాలు, మా ఉద్దేశాలు ఒకటే. అందుచే మాకు గల ఒడంబడికలకు మించిన సన్నిహిత సంబంధాలు ఉన్నాయి." ఈ భాషణను ఫ్రెంచి పత్రికలు పొగడాయి. తృప్తిచెందాయి. ఛాంబర్లేను, దలదీయ ఉద్దేశాలు, ఇంగ్లండు, ఫ్రెంచి బూర్జువాల యొక్క లాభాలు నేడుఒకటే. కాని, ఫ్రాంసులో అతివాద ప్రభుత్వము వస్తే, అప్పుడు ఒకటిగా ఉండవు. ఆరోజు ఫ్రాంసుపై ఇటలీ దండెత్తినా ఇంగ్లండు సాయముచేయ నవసరములేదు. అని ఛాంబర్లేను భావము.

నిజంగా ఛాంబర్లేను తన విధానాన్ని,(జర్మనీ ఇటలీలను సంతృప్తిపర్చి వానిని వశమునగా కుండబాస్తూ నాలుగు రాజ్యాల ఒడంబడికను ఏర్పరచే విధానాన్ని) మానుకొన్నాడా అంటే మానుకోలేదని ఆ విదేశ పత్రికావిలేఖరుల ముందు ఇచ్చిన ఉపన్యాసములోనే చెప్పాడు. అంతేగాక "నాకు మంచిదనితోచిన మార్గాన్ని వదిలి ఇతరుల సలహాపై నడిస్తే రేపుయుద్ధము వస్తే వస్తుందనుకోండి. ఆరోజు ఇతరులుచెప్పిన సలహాపై వెళ్ళానని తృప్తి నాకు గాని, ఇతరులకుగాని ఎవరికీఉండదు." ఒక ఛాంబర్లేను మార్గమే శాంతికి దారితీస్తుందట; ఈ ప్రపంచంలో సరియైన మార్గాన వెళ్ళగల తెలివితేటలు ఒక్క ఛాంబర్లేనుకు మాత్రమే ఉన్నాయట; ఫాసిస్టు ఫ్రాన్సు కాలనీలు తనకు కావాలని ఇటలీ చేసే అల్లరిని మానమని ఏమయినా ఛాంబర్లేను చెప్పాడా అంటే లేదు. అట్టి మార్పులు ఆంగ్లో ఇటాలియను ఒడంబడికకు వ్యతిరేకంగాదు అని మాత్రము తెలియజేశాడట; అయితే అలా వ్యతిరేకంగాపోతే, తను చర్య తీసుకోనని ఫ్రాంసుకు సాయము చేయనని ఒకప్రక్కన ప్రకటిస్తూ, అట్టి మార్పులు ఒక ఒడంబడికకు వ్యతిరేకమంటేమాత్రము లాభమేమిటి;

జర్మనీ ఇటలీ కోర్కెలు న్యాయమైనవనే చాటుతూఉంది. సూయజుకాలవ రేట్లు తగ్గించాలంటూఉంది. కడకు మాంచెస్టరు గార్డియను, ఇంగ్లండు లిబరలు పత్రికకూడ అలాగే అంటూ ఉంది. దీన్నిబట్టి ఇంగ్లండు ప్రభుత్వం ఏలా పోతూఉంది స్పష్టమవుతుంది. సూయజు కాలవ రేట్లు తగ్గించడానికి కేవలము, ఫ్రాంసు, ఇంగ్లండుల సొత్తుకాదు దానిలో ఈజిప్టుకుకూడ హక్కుఉంది. ఈజిప్టు రాజ్యభాగములోనిది.అది తనకు నష్టము తెస్తుందని వ్యతిరేకాభిప్రాయము ప్రకటించింది. అయితే మాత్రమేమి; దొంగలు దొంగలు ఊరులు పంచుకోడానికి;

### యూదులు

జర్మనీ ఇటలీలను "సంతృప్తి" పర్చాలనీ ఛాంబర్లేను ఇంత ప్రయత్నిస్తున్నా, జర్మనీ మాత్రము తన పంధాను మానలేదు. యూదులను హింసిస్తూనేఉంది. యూదులరక్షణకోసం మునుపటి బ్రిటిషు ప్రధాని బాల్డ్వీను ఒక రక్షణ నిధిని ఏర్పరచాడు. దానితో మండిపడి జర్మను పత్రికలు బాల్డ్వీనును తీవ్రంగా తిట్టాయి. ఇది బాగాలేదని ఛాంబర్లేను అంటే లండనులో విదేశ పత్రికా విలేఖరులు ఏర్పాటుచేసినవిందుకు జర్మనులు హాజరు కానేలేదు. ఇంగ్లండు మాత్రమేమి చేసిందని, అమృతసరు హత్యలు,బోయరు యుద్ధంలో బ్రిటిషుసైనికుల హత్యాకాండలను ఏకరవుపెట్టాయి జర్మనీపత్రికలు. పాలస్టయినులో నేడు అరబ్బులమీద గావించే దౌర్జన్యాలను వర్ణించాయి.

అరబ్బులను అణచడానికి ఇంగ్లండు ఎన్ని ప్రయత్నాలుచేసినా కడకు అరబ్బులకు కొన్ని సౌకర్యాలు ఇవ్వక తప్పిందికాదు. ముఖ్యంగా పాలెస్టయినుకు యూదులు మరింత ఎక్కువ మంది వెళ్ళి నివాస మేర్పరచుకోడానికి ఒప్పుకోలేదు.

అయితే అరబ్బులను చీలదీయడానికి తన పన్నాగాలను మానడము లేదు. ఈజిప్టులో ప్రస్తుతం ప్రవాసములోనున్న నైషిషిబీ అనే అరబ్బు మితవాద నాయకునికి, అతని అనుచరులకు లండను కాన్ఫరెన్సులో పాల్గొనడానికి అవకాశము కల్పించింది. ఈజిప్టు గ్రాండ్ ముఫ్తినికూడ రానిచ్చిననే తాను లండను కాన్ఫరెన్సులో పాల్గొంటానని తెలియజేసింది. కాని తిరుగుబాటు నాయకుని గ్రాండ్ ముఫ్తీని మాత్రము రానివ్వనంటూ ఉంది బ్రిటిషు ప్రభుత్వము

### స్పెయిను

జర్మనీ ఒక ప్రక్క అల్లరిచేస్తూ ఉంటే, రెండవ ప్రక్క ఇటలీ ఏమైనా ఊరుకుంటూ ఉందా అంటే అదీలేదు. ఫ్రాంసుతో ఏలా కయ్యానికి కాలు దువ్వుతుందో, ఫ్రాంసును ఏలా దబాయిస్తూ ఉందో చూచాము. స్పెయినుకు తిరిగి సైన్యాన్ని పంపించింది. ఇంగ్లండు పార్లమెంటులో బట్లరు ఒక ప్రశ్నకు సమాధానము చెప్పుతూ ఆమధ్య స్పెయినుకు నుండి వెళ్ళిన సైన్యముయొక్క ఖాళీని భర్తీ చేయటానికి ఇటలీ కొంత మందిని పంపినదిగాని మునుపటికన్న ఇటలీ సైన్యము స్పెయినుకు ఎక్కువ పంపబడలేదన్నాడు;

ఈక్రొత్త ఇటాలియను సైన్యంతో తిరిగి విమానదాడులు, పగంరాత్రి సమయాన బాంబు వర్షాలు, శిశు శరణాలయాలును హాస్పిటల్సును భగ్నము గావించడము తిరిగి ఆరంభమయింది. త్వరలో తిరిగి గొప్ప యుద్ధము ఆరంభమవుతుందని స్పెయిను ప్రభుత్వ ప్రధాని నెగ్రిన్ ఒక బ్రాడ్‌కాస్టు చేశాడు. "ఈ వరకు ఎప్పుడూ లేనిరీతిని శత్రుసైన్యాలను మొండితనముగా ఎదుర్కొండి" అని ప్రకటించాడు. ఈబ్రోనది తీరాన కోటలు నిర్మించారు. 40 ఏండ్లకు పైబడిన పురుషులుకూడ యుద్ధములో పాల్గొనడానికి వీలుండేటట్టు పరిశ్రమలలో రైళ్ళను, కారులను నడిపేవానిలో స్త్రీలే పురుషుల స్థానాలలో పని చేస్తున్నారు.

విద్రోహ నాయకుడు ఫ్రాంకో అల్ఫాన్సోకు, స్పెయినుకు ఈవరకు రాజుగ ఉండినవానికి అతని ఆస్తి, అతని పౌరసత్వ హక్కులు ఇచ్చాడు. స్పెయిను ప్రభుత్వం పూర్తిగా తనకు లొంగిపోతే తప్ప మరెట్టి రాజీ లేదంటూ మరియొక దాడికి తయారవుతున్నాడు కూడ. తనకు బెల్లిగెరెంటు హక్కులు ఇవ్వలేదే అని వాపోతున్నాడు. ఎందుకంటే స్పెయినును ఓడించాలంటే మరియొక లక్ష విదేశ సైన్యమయినా ఫ్రాంకోకు లేనిదే సాధ్యము కాదని, ఈవరకు భారతీయ సేనాధ్యక్షుడుగా ఉండిన ఫిలిప్ చెట్వుడ్ ఒక రహస్యపు నివేదికను ఛాంబర్లేనుకు పంపాడట; అందుచే స్పెయిను ప్రభుత్వానికి ఆహారము దొరకకుండా చేసి, మాడ్చి అయినా వశము చేసుకోవాలని, దానికోసం బెలిజెరెంటు హక్కులు కావాలని ఫ్రాంకోయొక్క తాపత్రయము. అందుకోసమే ఇంగ్లండు కూడ తహతహపడుతూ ఉంది. అయితే ఫ్రెంచి కార్మికుల పట్టుదలను చూచి ఫ్రెంచిప్రభుత్వము ఒప్పుకోవడములేదు. అయినా, ఛాంబర్లేను ఇటలీకి వెళ్ళినపుడు ఈ హక్కులు ఫ్రాంకోకు ఇస్తాడని వదంతులు బాగా ఉన్నాయి. ఇదంతా ఇటలీలోను, జర్మనీలోను ఫాసిస్టు నియంతలు పతనము కాకుండా చూడడానికే.

### ఇంగ్లండు జర్మనీ వర్తకపుటొడంబడిక

జర్మనీ వర్తక ముగత మాసములో నవంబరులో మరింత క్షీణించినది. ఎగుమతులు 45 కోట్ల 30 లక్షల మార్కులు, దిగుమతులు 52 కోట్ల 20 లక్షల మార్కులు. అంటే జర్మనీ విదేశ వ్యాపారములో దాదాపు 7కోట్లమార్కులు ఒక్క నెలలోనే నష్టము వచ్చింది. అందుచేతనే జర్మనీ బ్యాంకి అధ్యక్షుడు డాక్టరు స్కాట్ ఫ్రాన్స్‌కు పరుగెత్తాడు. అచ్చటనుండి బెల్జియానికి, బెల్జియాన్నుండి లండనుకు పరుగెత్తాడు. లండనులో ఇంగ్లండు బ్యాంకు గవర్నరు మాంటేగూ నార్మతో రహస్య ఆలోచనలు చేశాడు. ఇంగ్లండుకు జర్మను ఈ రెండు దేశాలకు మాత్రము వచ్చే సరుకువిషయమై ఒడంబడిక చేసుకోవాలని స్కాట్ ప్రయత్నం. మాంటేగూ నార్మను ప్రపంచమందంతా ఎచ్చటెచ్చట ఇంగ్లండు జర్మనీలు వర్తక వ్యాపారాలు సాగిస్తున్నాయో సాగిస్తాయో ఆయాస్థలాలలో ఒక్కొక్క దేశముయొక్క భాగమెంతో నిర్ణయించిఒక ఒడంబడికకు రానిదే సంప్రదింపులలో అర్థము లేదని గట్టిగా చెప్పాడు. జర్మనీ వర్తకపుపోటీని ఎదుర్కోవాలంటే, తన ప్రపంచ వ్యాపారానికి నష్టమురాకుండా ఉండాలంటే అట్టి ఒడంబడిక ఇంగ్లండుకు చాలఅవసరము.

జర్మనీ విదేశాలనుండి ఎక్కువగా తనకు కావలసిన సామగ్రిని తెప్పించుకుంటుంది.వానికి కావలసిన డబ్బును పంపదు, పంపడానికి వీలు లేదంటుంది. ఆ అప్పులోకి తన వద్దనుండి తన సరకులనుతీసుకోమంటుంది,ఈపద్ధతివల్ల జర్మనీ వర్తకము చాల ఎక్కువయింది. బ్రిటిషు వర్తకము పడిపోయింది. దీనిని ఎదుర్కోడానికిపార్లమెంటులో ఒక చట్టాన్ని చేశారు. ఈచట్టము వలన జర్మనీ వర్తకులను ఎదుర్కోడానికి కావలసిన అధికారమంతా ఇవ్వబడింది. డాక్టరు స్కాట్ సంప్రదింపులకు రావడానికి కారణమిదే. చట్టంమీద చర్చ జరుగుతూ ఉన్నప్పుడూ, ప్రపంచ మార్కెట్టులను పంచుకోవడంలో జర్మనీ రాజీకివస్తుందని లేనిచో దానిని ఎదుర్కొగలం

(మిగతా 33 వ పేజీలో)

## విద్యార్థులకు

# శిక్షణ శిబిరం

గత రెండు సంవత్సరములలో మన రాష్ట్రములలో విద్యార్థి ఉద్యమము చాల అభివృద్ధి నొందినది. తన నానాటి అభివృద్ధిని ప్రస్తుత విద్యావిధానము ఏ విధముగా అరికట్టుచున్నది విద్యార్థులు తెలుసుకున్నారు. విద్యాలయాలలో విద్యాధికారులు తమను ఎంత హీనముగా చూచుచున్నది గ్రహించారు. గత రెండు సంవత్సరములలో తమ ప్రాథమిక హక్కుల కొరకై తీవ్రమైన పోరాటమును సాగించారు. అనేకచోట్ల విద్యార్థుల సమ్మెలు, ఆందోళన జరిగినవి. వీటి ఫలితముగా విద్యార్థులలో ఒక నిర్దిష్టమైన ఐక్యత నైతిక్యము కలిగినది. విద్యార్థి సంఘములు నొందవలసిన బలపడినవి. మన ప్రాథమిక హక్కులకై మనమీ పోరాటమును సాగించుచున్నపుడు మన శక్తినంతా నిర్మాణరహిత కార్యక్రమములో (unconstructive efforts) వృథాచేస్తున్నామని మన పెద్దలు మనలను విమర్శించారు. మనకిప్పుడు కొంత ఐక్యత, బలము చేకూరినది గనుక, ఈ బలమును, ఈ ఐక్యతను మనల నెదుర్కొను చున్న జాతీయ సమస్యలకొరకు ఉపయోగించి మన విద్యుక్తధర్మ సౌందర్యమును తెలియచేయు సమయము వచ్చినది.

విద్యార్థుల దృక్పథమునుబట్టి మన జాతీయ సమస్యలలో, జన సామాన్యపు విద్యాభివృద్ధి చాల ముఖ్యమైనది. ప్రస్తుతము బ్రిటిషు ఇండియాలో చదువగలిగిన వాళ్లు 100 కు 10 మంది. స్వదేశ సంస్థానములలో ఇంతకంటె తక్కువ. గవర్నమెంటు ప్రయత్నములు, నేటి విద్యావిధానము, జనసామాన్యపు విద్యాభివృద్ధి విషయములో పూర్తిగా విఫలము లైనవి. పైగా, విద్యావిధానం అందుకు వ్యతిరేక ఫలితముల కలుగ జేసింది. చదువుకున్న కొద్దిమందికీ, జన సామాన్యమునకూ మధ్య ఒక పెద్ద అగాధం ఏర్పడి పడింది. ఈ పద్ధతిని మార్చే సమయం వచ్చింది. జన సామాన్యము మధ్యకు వెళ్లి, వారిలో కలిసిపోయి, వారిని పైకి తేవలసిన బాధ్యత విద్యార్థులపై ఉన్నది. ప్రాథమిక హక్కులకై విద్యార్థులు సలిపిన పోరాటమువల్ల కలిగిన బలమును, ఐక్యతను ఈవిధముగా ఉపయోగించాలి. ఈ కార్యక్రమము విద్యార్థులను జన సామాన్యమునకు దగ్గరగా తీసుకువచ్చి, జన సామాన్యముయొక్క ఆర్థిక రాజకీయ పరిస్థితులను తెలియ చెప్పుతుంది.

ఈ విద్యావ్యాపక కార్యక్రమము, గట్టి నిర్మాణము, శిక్షణతో సాగుకొని యున్నది. మన విద్యా విధానము, జన సామాన్యమునకు పనికివచ్చు విషయములనే మాత్రము నేర్పుట లేదు. క్రిందటి సంవత్సరము బొంబాయి రాష్ట్రీ విద్యార్థి సంఘము యొక్క విద్యావ్యాపక కార్యక్రమము వల్ల, సరియైన శిక్షణ, నిర్మాణము లేనిది, సరియైన ఫలితం కలుగదని తెలిసింది. అందువలన, మద్రాసులో 1939, జనవరి 8,9 తేదీలలో జరుగు మద్రాసు రాష్ట్రీ విద్యార్థి మహాసభతోపాటు, ఒక "శిక్షణ శిబిరము" (Training Centre) ను సాగించుటకు మద్రాసు విద్యార్థి సంఘము నిశ్చయించినది. శిబిరం జనవరి 1 మొదలు 7 వరకు జరుగుతుంది. ప్రతి విద్యార్థికి భోజనమునకుగాను రు. 3 ఫీజుగా ఏర్పాటు చేయడమైనది. ముఖ్యమైన విషయములపై ఉపన్యాసముల నిచ్చుటకై విద్యావేత్తలు, పల్లెకు వర్కర్లు, కొంతమంది మంత్రులు, ఆహ్వానింపబడి యున్నారు. ప్రత్యేకముగా, గట్టి శిక్షణ నిచ్చుటకై ఉదయం, సాయంత్రం, క్లాసులు జరుగును. "సిలబసు" లోని ముఖ్యమైన విషయములు:—

1. జన సామాన్యంలో అవిద్యకు కారణములు.
2. విద్యావ్యాపక పద్ధతులు — ప్రభుత్వము, రాజకీయ సంస్థలు—విద్యార్థుల స్థానము.
3. వయోజన విద్య (Adult Education).
   - i. వయోజన విద్యలో ముఖ్య పద్ధతులు.
   - ii. ఏకాంక నాటకముల ప్రదర్శనము—వాటి ఉపయోగము.
   - iii. వాల్ న్యూస్ పేపరు (Wall News Paper).
   - iv. చిన్న పిల్లలకు కిండర్‌గార్టెను క్లాసుల నడుపుట.
   - v. జాతీయ గీతములు.
   - vi. గ్రామీయుల ఆటలు (Rural sports).
4. పల్లెకు హెల్తు, హైజీన్
   - i. ప్రథమ చికిత్స (First Aid)
   - ii. శానిటేషన్ (Sanitation)
   - iii. కలరా మొదలగువ్యాధుల నరికట్టుట
   - iiii. మంచి నీటి వసతి, మొదలగునవి.
5. ఆర్థిక, సాంఘిక సమస్యలు.
   - i. స్టాటిస్టిక్సు (Spatistics) ను తయారు చేయుట.
   - ii. రైతు సమస్యలు (Tenency Pro blems)
   - iii. జనసామాన్యపు ఆర్థిక పరిస్థితులు.
6. రాజకీయ సమస్యలు.
   - i. ప్రభుత్వము-పరిపాలన-వీటి నిర్మాణము
   - ii. రైతులకు సంబంధించిన చట్టములు.

ఈ శిబిరం ప్రస్తుతము జరుపుటలో ముఖ్యోద్దేశము, విద్యార్థి కాన్ఫరెన్సుకు వచ్చు ప్రతినిధులకు మంచి శిక్షణ ఇచ్చుట: అందువలన రాష్ట్రములోని విద్యార్థి సంఘములు, విద్యా సంస్థలు, శిబిరమునకు విద్యార్థుల పంపవలసినదిగా కోరుచున్నాము. శిబిరమునకు రాదలచుకున్నవారు విద్యార్థి సంఘము లేక కాంగ్రెసు సంఘపు కార్యదర్శి సిఫారసు రు. 3 లు ఫీజుతో సహా డిసెంబరు 20 వ తేదీకి ఈ క్రింది అడ్రసుకు తమ దరఖాస్తుల పంపవలయును. "స్టూడెంట్సు లిటరసీ ట్రైనింగు క్యాంపు. మద్రాసు విద్యార్థి సంఘం, జయామాన్షన్సు, పార్కు టవును, మద్రాసు(Jaya mansions, Park Town).

మద్రాసు రాష్ట్ర విద్యార్థి మహాసభతో పాటు శిబిరం జరుపబడును గాన, కాన్ఫరెన్సుకు వచ్చే వారందరు ఒక వారం రోజులు ముందు వచ్చిన, ఈ అవకాశమును గూడ ఉపయోగించుకొనగలరు.

మద్రాసు విద్యార్థి సంఘం
మద్రాసు.

# రైతు విప్లవం రావాలి!

## జమీందార్ల పుట్టుపూర్వోత్తరాలు

ఈ నెల 6వ తేదీని, హూగ్లీ జిల్లా ఛోరా గ్రామంలో జరిగిన రెండవ బెంగాల్ రాష్ట్రీ రైతు సమావేశంలో రైతు నాయకులైన డా॥ మజుందార్—బంకిం ముఖర్జీ—అబూ హుస్సేన్, సర్కార్—ముజఫర్ అహమ్మద్—ఎ. ముర్, మిస్త్రి గారలు యీ క్రింద ప్రకటించబడిన "థీసిస్"ను ప్రతిపాదించగా, ఆమోదింపబడెను:—

"నేడు ఇండియాలో వ్యాపించిపోతూన్న విప్లవం, ప్రజాతంత్రస్వభావాన్ని కలిగియున్నది. కనుకనే, ఇది జమీందారీ విధానానికి, సామ్రాజ్య ప్రభుత్వానికీ, ప్రతిరేకం. అభివృద్ధి నిరోధక శక్తులైన జమీందారీ విధానం, సామ్రాజ్యవాదం—ఈ రెంటికీ అవినా భావసంబంధం కలదు. ఒకదాని సహాయం లేకుండా రెండవది ఉండలేదు. ఇండియాలో ఈస్టు ఇండియా కంపెనీవారు రాజ్యాంగాధికారమును స్థాపించిన తరువాత, కొత్త రకమైన జమీందార్లు బయలు దేరిరి. వారే నేడు మనం చూచుచున్న జమీందార్లు. భూమిమీద వారికి సర్వాధికారములు ఈయబడినవి. కాలక్రమేణా, మీద శిస్తులను హెచ్చించుట—రైతుల భూములను స్వాధీన పరచుకొనుట మొదలైన అధికారములు సంపాదించుకొన్నారు. వీరి పెత్తనం వల్ల, అనాదిగా స్థిర మూలమును దాల్చిన గ్రామ పంచాయితీలు నశించవలసి వచ్చినది. ఈ జమీందార్ల ప్రాబల్యం ఎంతవరకు హెచ్చినదంటే, 1830 సంవత్సర ప్రాంతాల్లో రైతులు భూమిని కలిగి యుండడం అంటే ఒక నష్టం అన్నమాట: ఈ విధంగా, రైతుల భూమిని జమీందార్లు క్రమక్రమంగా స్వాధీనపరచు కొన్నందున, రైతులు పొలంలేని కూలీలుగా మారవలసి వచ్చినది ఇంతలో విదేశాల నుంచి సామ్రాజ్యవాదులు దేశంలో ప్రవేశించిరి. అప్పటి నుంచి ఇప్పటివరకూ, జమీందార్లు ప్రభుత్వంతో కలిసిపోయారు, జమీందారీ విధానాన్ని మనం నిర్మూలించిననేగాని, సామ్రాజ్యవాదుల పెత్తనం నుంచి రక్షింపబడ జాలము. ఇందువల్లనే, ప్రజా ప్రభుత్వం కొరకు నేడు మనం జరుపుచున్న పోరాటమును "రైతుల విప్లవం" అని పిలువవచ్చును.

నేడు దేశంలో వ్యవసాయ విధానం అంతా అతివేగంతో, నశిస్తోంది. కిరాయితీ హక్కు గలిగిన రైతుల భూములు, క్రమ క్రమంగా, వ్యవసాయంతో సంబంధము లేని వర్గముల చేతులలోకి పోతున్నాయి. బెంగాల్ రాష్ట్రంలో, వ్యవసాయమే జీవనాధారంగా గల ప్రజలలో నూటికి 60 మంది భూములు లేక, కూలి చేసుకొని బ్రతుకుతున్నారు. రోజు రోజుకీ, రాష్ట్ర మందలి భూమి జమీందార్ల వశమవుతోంది. కాని యీ జమీందార్లు విస్తారంగా పెట్టుబడి పెట్టి వ్యవసాయాన్ని అభివృద్ధి చేయటంలేదు. పైగా, తుప్పుపట్టిన పాత పద్ధతులే అవలంబిస్తున్నారు. రైతులవద్ద ధనరూపంలో శిస్తు వసూలు చేయుటకు బదులు, కూలి చేయించుకొంటున్నారు. ఈ కూలీల స్థితి దానివలకంటె అధమంగా ఉంది.

గత శతాబ్దంలో, దేశీయ పెట్టుబడిదార్లు మన దేశంలో కూడా బయల్దేరారు. మన సామాజిక జీవనంలో యిదొక కొత్త పట్టం. ఈ వర్గం రోజు రోజుకీ బలం సంపాదించుకొంటు యున్న విషయంలో సందేహం లేదు. కాని, వీరి బలానికి, అభివృద్ధికీ, బ్రిటిషు సామ్రాజ్యవాదుల రేపే అడ్డంకులుగా ఉన్నారు. ఇందువల్లనే మన దేశపు పెట్టుబడిదార్లు బ్రిటిషు పెట్టుబడిదారులకు, వర్గంలో విరోధభావం (hostility) వహించియున్నారు. కాని, వీరికి—జమీందారీ వర్గానికి మధ్య అన్యోన్య సంబంధం ఉండడం వల్ల, వృత్తిసంబంధ—ఆదాయాలు విప్లవమార్గాన్ని అనుసరించ లేకున్నారు. ఇట్టి పరిస్థితులలో, మన కార్మికులు రైతులు విప్లవ భావం ఇప్పటి వారి పోరాటానికి వీరి విధమైన విప్లవ దృక్పథాన్ని, విప్లవ కార్యక్రమాన్ని, ఈయవలసి యుంది. ఇప్పటికంటె ఉన్నత స్థాయికి పోరాటం చెప్పవలసియుంది. రైతులు, కార్మికులు తమ తమ ప్రత్యేక వర్గ సంస్థలను స్థాపించుకొని పని చేయుట ద్వారా, వీరు యీ కర్తవ్యాన్ని చక్కగా నిర్వర్తింప గలుగుతారు.

నేడు రైతులకు అత్యవసర కోర్కె ఏది: జమీందారీవిధానాన్ని నాశనం చేయుట, భూమిని దున్నే రైతుకే భూమిని స్వాధీనం చేయుట. నేటి మన విప్లవపోరాటంలోకూడ ఇదే అన్నిటి కంటె ముఖ్యమైన తీవ్రమైన విప్లవ నినాదం. ప్రత్యేకమైన రైతుసంఘాల అవసరం లేదని వాదించేవారు, మన జాతీయోద్యమం ఏవిధంగా నడవాలనీ, బలం చేకూర్చుకోవాలో తెలుసుకోవడం లేదన్న మాట. మన జాతీయ సంస్థ అయిన కాంగ్రెసులో వారు వ్యక్తిగతంగా సభలు సాగించి సమ్మేళనా చేసితే, ఇతర వర్గాల హక్కులకే ఎక్కువ ప్రాధాన్యత వస్తుంది. తమ తమ సంఘాల ద్వారా కాంగ్రెసులో ప్రాతినిధ్యం సంపాదించుకొంటేనో, జాతీయపోరాటంలో రైతుల ప్రాధాన్యత హెచ్చు ఉంది. అంతే కాదు, మన ప్రజా సామాన్యపు విప్లవావశ్యాలను ప్రదర్శించే నిజమైన సంస్థగా మార్పుగలిగిన వార మవుతాము. రైతులకు ప్రత్యేక సంఘాలుండడం తప్పులేదు, అనేవారు కొందరున్నారు. కాని ఆ సంఘాలు కేవలము రైతుల ఆర్థిక సమస్యలను పరిష్కారం చెయ్యడానికే ఉండాలని వాదిస్తారు. వారు ఒక్క విషయాన్ని మరచిపోతున్నారు. వ్యవసాయ విధానములో రావలసిన మార్పులన్నీ, ఏ మార్పుల కొరకు రైతుసంఘాలు నేడు ఆందోళన చేస్తున్నాయో, అవి రాజ్యాంగాధికారం రైతువశమయితేనే గాని సాధ్యం కావు. ఈ ప్రధానాంశాన్ని వారు గుర్తించడం లేదు.

ఆర్థిక సమస్యను రాజకీయాదర్శం నుండి వేరు చేయడంలో అర్థంలేదు. నేడు ఇండియాలో పని చేస్తున్న రైతు సంఘాలన్నింటికీ ఒక రాజకీయ కార్యక్రమం, ఒక రాజకీయాదర్శం. కూడా ఉన్నదని అందరూ తెలుసుకోవలసి యుంది. కుల, మత కక్షలతో పనిచేసే కొన్ని సంస్థలు ఏవిధంగా ప్రజల ఆర్థిక హక్కులను ముందు పెట్టి పలుకుబడి సంపాదిస్తున్నాయో మనకు తెలుసు. కాని, రాజకీయ సమస్యల విషయం వస్తే, ఆ సంస్థలు దివాలా తీస్తున్నాయి. రైతులు తమ జమీందార్లతోనూ, షాహుకార్లతోనూ నిత్యమూ జరుపుతూన్న పోరాటాల ద్వారా రాజకీయ దృక్పథం వారిలో ఏర్పడుతోంది. ధనిక వర్గాలకు ఇది ఎంత ఇష్టం లేనప్పటికీ, వారట్టి అనుభవం సంపాదిస్తూనే ఉన్నారు, ఉంటారు కూడా.



# "కాంగ్రెసు జమీందారు" హయాంలో

9-12-38 వ తేదీని ఏజన్సీ పోలవరం తాలూకా రైతు మహాసభ రాజంపాలెంలో శ్రీ వెల్లూరి మందేశ్వర శర్మగారి అధ్యక్షతను జరిగెను. సుమారు 1000 మంది కోయప్రజలు హాజరైరి. 8-12-38 వ తేదీని నలుగురు కాంగ్రెసు ప్రచారకులు గంగోలు ఎస్టేటు హుక్కుం నేటలో రైతుపాటలతో ఊరేగుతూ, నదరు ఎస్టేటు టాకా సమీపించునది అవస్టేటు మేనేజరు అల్లుడు 10మంది నౌకర్లతో "నౌకరుమయ్యెంది" అను కేకలతో పరుగెత్తుకొనివచ్చి, తమ గ్రామములలో కాంగ్రెసువారు లెవరూ అడుగు పెట్ట కూడదని గట్టిగా హెచ్చరించెను. ఆయువకులు తాము ప్రభుత్వ జమీందారీ విచారణ సంఘము వారిచే ప్రకటించబడిన నివేదికను ప్రజలకు తెలియజెప్పుటకు వచ్చితిమనియు, గ్రామ వీధులలో తిరుగుటకు తమకు సంపూర్ణమైన హక్కు గలదనియు, తెలియజెప్పిరి, ఈ సంఘర్షణ చూచుటకై సుమారు 150 మంది స్త్రీ పురుషులు వచ్చిరి, జమీందారీ నివేదికలో ప్రజలకుగలుగ బోవు సౌకర్యములను గురించి కామ్రేడ్ ఇనుగంటి నారాయణరావుగారు వారికి బోధించుటకు ఉపక్రమించిరి."అసంగతులన్ని ప్రజలెరుగుదురు. మీరు పొండి"అని జమీందారీ మనుష్యులు కేకలు ప్రారంభించిరి. వెళ్ళనవసరంలేదని ప్రచారకులు ధైర్యంగా జవాబుచెప్పిరి. ముఖ్యవిషయములు చెప్పి వారక్కడనుంచి మరొకస్థలమునకు వెళ్లిరి కొందరు కూలీలు కాంగ్రెసు ప్రచారకులను, కాఫీ కొరకు తీసుకొనివెళ్ళి, కాఫీ కాయుటకు నీటిని పొయ్యిమీద పెట్టిరి. కాని ఎస్టేటుబంట్రోతువచ్చి బూతులుతిట్టి, పొయ్యి ఆర్పివేసి, అల్లరిచేసెను.

9-12-38 వ తేదీని మధ్యాహ్నం 11 గంటలకు మహాసభ ప్రారంభమయింది. విషయ నిర్ణయసభ జరుగుచుండ, గంగోలు ఎస్టేటు జమీందారు అల్లుడు శ్రీ బులుసు పాపయ్యశాస్త్రి గారు అప్పటికివచ్చిరి. వారి సమక్షంలో రైతులు తమ బాధలను గురించి చెప్పుకొనుటకు భయపడెదరు గాన విషయనిర్ణయసభకు రావలదని సభాధ్యక్షులు కోరిరి. నేను యిప్పటినుండి కదలను; ఈ యిల్లాగల మనిషి వచ్చి వెళ్ళమనే వరకు వెళ్ళనని శాస్త్రిగారు పట్టుదల వహించిరి శ్రీ పుసులూరి కోదండరామయ్యగారు కూడా ఆయనను ఎన్నోరీతుల కోరిరి. తానుకూడా కాంగ్రెసు సభ్యుడనేననీ, ఎవరెంతచెప్పినా కదలననీ పాపయ్యశాస్త్రిగారు మొండి సమాధానమిచ్చిరి పిమ్మట గుమ్మములవద్ద వాలంటీర్లను నిలిపి, ప్రతినిధులనుమాత్రమే విషయనిర్ణయ సభకు రానిచ్చిరి.

తరువాత మహాసభజరిగెను. సభాధ్యక్షులు, శ్రీ మందేశ్వర శర్మగారు జమీందారీ పద్ధతి రద్దుకావలసిన అవశ్యకతనుగురించి, జమీందారీ కమిటీవారి సిఫార్సులను గురించి, ఉపన్యసించిరి. ముకుంద వెంకటరంగమహాచార్యులుగారు, పుసులూరి కోదండరామయ్యగారు, ఇనుగంటి నారాయణరావుగారు, కొరపాటి పట్టాభిరామయ్యగారు మొదలైనవారు కూడా సభలో ఉపన్యసించిరి.

తరువాత, యీక్రింది తీర్మానములు ఏకగ్రీవముగా ఆమోదింపబడెను:—

1. ప్రస్తుత జమీందారీపద్ధతి రద్దుగాక తప్పదనియు, అట్లు జరిగినగాని దేశముయొక్క ఆర్థిక, రాజకీయ, అభివృద్ధి సాధ్యముకాదని యీ యీసభవారు విశ్వసించుచున్నారు. అందునను, జమీందారీవిచారణ సంఘమువారు గత 100 సంవత్సరములనుండి జమీన్ రైతులు భరించుచున్న బాధలను సంపూర్ణముగా గ్రహించుటను, తదితరమైన కొన్ని కష్టములను తొలగించుటకును ప్రాతిపదికగా తయారుచేసిన సూచనలకు యీ సభవారు పైకమిటీ వారికి కృతజ్ఞతాపూర్వకమైన వందనములను తెలియ జేయుచున్నారు.

2. కొన్ని జమీందారీలలో, ముఖ్యముగా గంగోలు జమీందారీలో "సేరీలు అనే పేరుతో ఆక్రమింపబడిన రైతీయానాం - సాముదాయిక భూములపట్ల రైతులకు న్యాయముకలుగజేయుటకుగాను, ప్రభుత్వనివేదికయందు సూచనలు లేకపోవుటకు యీసభవారు చింతిల్లుచున్నారు, జమీందార్లచేత ఆక్రమించుకోబడిన రైతీ - యీనాం - సాముదాయిక భూములను ఆ యా తరగతి ప్రజలకు తిరిగి స్వాధీనము చేయబడునట్లు స్పష్టముగా రాబోవు భూమి సవరణచట్టములో ఏర్పాటుచేయవలెనని ప్రభుత్వమువారిని, శాసనసభ్యులను యీసభవారు కోరుచున్నారు.

3. ఏజన్సీ జమీందారీల భూముల విషయములో పై కమిటీవారు చేసిన "గయాళ భూములను ఇతరుల కియ్యబడు నిమిత్తం విడదీయవలెను" అను సిఫార్సులో, ఏజన్సీప్రాంతమందలి భూములు లేని వ్యవసాయకూలీలకును, వ్యవసాయకూలీలకును, బీదరైతులకును, నిరుద్యోగులకును, సరిపడిన భూములు యిచ్చిన తరువాతనే యితరుల కివ్వబడును. అను అర్థం వచ్చేలాగున స్పష్టముగ ప్రకటించవలెనని మదరాసు ప్రభుత్వమును యీసభవారుకోరుచున్నారు.

4. ఏజన్సీ జమీందారీలలోని కొండలు రైతుల పశువులకు పన్ను లేకుండగ మేయ నిచ్చే దేశములను, విసిరిపల్లలను, జిల్లాకలెక్టరుగారి ప్రాతిపూర్వకమైన అనుమతిలేనిదే చెల్లకుండును ఆ క్లాజుకు కొత్తశాసనములో చేర్పవలెనని యీ సభవారు కోరుచున్నారు.

5. "పంటపల్లకి పైగానున్న భాగమును, సూరారు తాలూకానున్న, ఏజన్సీగారుండి మిగత భాగమును పల్లెదిగా మార్చవలెను" అని పై కమిటీవారుచేసిన సిఫార్సు తృప్తి కరముగాలేదు కాబట్టి ఏవిధమైనమినహాయింపు లేకుండా, యావత్తు ఏజన్సీ ప్రదేశమును పెల్లడిలో చేర్చవలెనని యీసభవారు కోరుచున్నారు.

6, పోలవరం తాలూకాలో ప్రథమమున అనావృష్టిచేతను-పిమ్మట అతివృష్టిచేతను, తరువాత నవంబరు నెలలో తుపానుచేతను, అనేక పంటలు పశువులు యిండ్లు మొదలైనవిపోయి, రైతులకు విశేషనష్టము కలిగినది గాన గవర్నమెంటు జమీందారీ గ్రామములలో పన్ను రెమిషన్ యిప్పించవలెననియు, ముందు సత్వరము వ్యవసాయం చేసుకొనుటకు అవసరమైన ఏర్పాట్లు చేయించవలసినదిగమదరాసు ప్రభుత్వమును యీసభవారు కోరుచున్నారు,

7. రైతుయొక్క కుటుంబపోషణకు సరిపోనట్టియు, ఖర్చుకు సరిపోవు ఆదాయము రానట్టియు, బహుస్వల్పపరిమితి గల్గినట్టియు, భూములకు ఏవిధమైన పన్ను లేకుండా చేయుటకు తగిన సవరణను కొత్తచట్టములో చేర్పవలెనని యీసభవారు కోరుచున్నారు.

---

# ఒక జమీందారు ప్రముఖుని నిరాశ!

10—12—38 వ తేదీని దర్భాంగలో జరిగిన జమీందార్ల సమావేశంలో విజయనగరం (కాశీ) మహారాజ్ కుమార్ గారు ఉపన్యసిస్తూ యీ క్రిందివిధముగా ఉద్బోధించారు:—

"మన జీవితము రైతుల సద్భావము మీద పూర్తిగా ఆధారపడి యుంది. మనమెకల వారికి సద్భావము లేదు. స్పష్టముగా కనిపిస్తూన్న అంశాన్నిగురించి నేను విస్తరించి చెప్పనవసరము లేదు. నిజంగా సామాన్య జనులంతా సద్భావం ఉంటే, శాసన సభలలో మన మింత అల్పసంఖ్యాకులమై ఉండేవారము కాము. మన వర్గానికి చెందినవారు బూజుపట్టిన పురాతన సాంప్రదాయాలకు అంటిపెట్టుకొని వేళ్లాడుతున్నారు. ఇందువల్ల మనకూ—రైతులకూ మధ్యగల స్పర్థ రోజురోజుకు వృద్ధిచెందుతోంది. మనము నిజమైన సంస్కారము పొందితేనే గాని, ఎట్టి ఆశ లేదని నా అభిప్రాయం. నిజమైన త్యాగాలకు మనం సిద్ధపడాలి.

"ఇక ముందు కూడా మనం జమీందార్లుగా ఉండాలంటే, నిజమైన త్యాగాలకు మనము సిద్ధపడాలి మన కాంగ్రెసు మిత్రులు రైతులకు కొన్ని ఉపకారాలు చేస్తున్నారు. మనము వారికన్న ఎక్కువ ఉపకారాలు చేయవలసియుంది. కాలము మారిపోయింది. కాలముతో పాటు మనమూ మారాలి. జమీందారు అనుభవించగలిగిన భోగాలన్నీ మనము నేటివరకూ అనుభవించాము. ఇప్పుడు వాటిలో అధిక భాగాన్ని వదులుకోవలసి వచ్చింది. సద్భావముతోనే అపనిని చేదాం.

"విదేశాలలో జమీందార్లు హంసతూలికా తల్పముల మీద పరుండి హాయిగా జీవితము గడుపుచున్నారని మనం అనుకోకూడదు. ఎట్టి సుఖం నేడు వారికి లేదు. ప్రభుత్వాలు వారిమీద పన్నులు ఎధించగా, గత్యంతరంలేక భూముల్ని అమ్మివేసుకోవలసి వచ్చింది. ఈవిషయాన్ని మనం గుర్తించి, మనం సర్వనాశనము కాకుండా రక్షించుకోవాలి. మనం శాసన సభలను స్వాధీనపరచుకొనలేకపోతే ఉపద్రవం తప్పదు.

### పరస్పర సద్భావం అవసరము

"రైతులు ఆనందంగా జీవించగలిగే స్థితికి వారిని తీసుకురావలసియుంది ఇది మన ప్రథమ కర్తవ్యం, అప్పుడే వారు హృదయపూర్వకంగా ప్రత్యుపకారంచేస్తారు, తమ జమీందార్లయెడల కృతజ్ఞతకలిగి యుంటారు నేటి మన దుస్థితిని గురించి కలవరపడుట గత జల సేతుబంధనం వంటిది. మనమే కొంచెం దూరదృష్టితో మెలగినట్లయితే, మనం ఊహించినవాటికన్న ఎక్కువ సౌకర్యాలు రైతుకు కలిగించి యుండేవారం. ఈ విషయాన్ని నేనే ఒప్పుకుంటాను. కాబట్టిమొట్ట మొదట మనం చేయవలసినది ఏమంటే, స్వయంగా మనము రైతులవద్దకువెళ్ళి రైతులూ మనం ఒకే విధానంలో భాగాలమనీ మనఉభయులకూ మధ్య అన్యోన్య సహకారం సద్భావం లేకపోయినట్లయితే యీవిధానం సాగేదికాదనీ రైతులకు నచ్చజెప్పాలి. జన సామాన్యంఎంతో దౌర్భాగ్యస్థితి ననుభవిస్తున్నారు, ఈవిషయాన్ని మనం అంగీకరించితీరాలి, వారికి మనం సాయపడాలి ఇది మనం నిర్వర్తించవలసిన పవిత్ర కర్తవ్యం. పూర్వం రైతులు జమీందార్లనే తమ తల్లి తండ్రులుగా చూచుకొనేవారు. ఇప్పుడు వారిలో అటువంటిప్రేమ తిరిగి కలిగేలాగు మనం చేయాలి.

### మరొక మార్గం

"మరొక మార్గాన్నికూడా నేను సూచిస్తాను. మన ఎస్టేట్లన్నింటినీ ప్రభుత్వమే స్వాధీనపరచుకొని, మనకు నష్టపరిహారం యిచ్చేలాగు ఎందుకు ప్రభుత్వాన్నికోరకూడదు? ఇందుకై ఎందుకు ఆందోళన సల్పరాదు? ఎందువల్లనంటే, జరగవలసినంత సంస్కారం మనలో జరుగుతుందనేఆశ నాకులేదు, దీన్ని మీరు కారణంలేని కంగారు, అని పిలువవచ్చు. కాని నేనందుకు విచారించను. ఎందువల్ల? నామరూపాలుకూడా లేకుండా మనం తుడిచిపెట్టుకొని పోయేరోజులు ఆసన్నమయాయి.

"అయినా, జమీందార్లందరూ కలసి, ఒక అఖిలభారతసంస్థను స్థాపించుకోవడం నేడు అత్యవసరం కాబట్టి అట్టి అభిప్రాయాన్ని నేను హృదయపూర్వకంగా ఆహ్వానిస్తున్నాను. ఆ విధంగా మనం ఐక్యతచెందాలి. పల్లెటూళ్ళలో మనపలుకుబడిని వ్యాపించుకొనే విషయంలో ఎంతెంత అభివృద్ధి పొందుతున్నామో అప్పుడప్పుడు పరిశీలించుకొంటూ, పునరాలోచనకు అవకాశం కలుగజేసుకొంటూ, ముందుకు నడవాలి. మనకూ-రైతులకూ మధ్య ఏర్పడే కలహాలను పరిష్కరించుకోడానికి ఒక న్యాయ విచారణ సంఘాన్నికూడా దీనికు ఏర్పాటు చేసుకొనవచ్చును."

### అఖిలభారత సంస్థ

తరువాత సభాప్రతినిధులు అనేకచర్చలుజరిపి అఖిలభారత జమీందార్ల సంస్థను ఏర్పరచు తీర్మానమును ఆమోదించారు.తరువాతదార్భంగా మహారాజుగారు సూచించిన ప్రకారం అఖిల భారత జమీందార్ల ఫెడరేషన్‌నుస్థాపించుటకును మహారాజుగారే దానికి అధ్యక్షులుగా ఉండవలెననీ తీర్మానించబడింది,

1939 వ సంవత్సరం, ఫిబ్రవరి-మార్చి నెలలలో లక్నోలో తిరిగి యింతకంటె పెద్ద సమావేశం జరుపుటకు సభవారు నిశ్చయించినారు.



# దేశోద్ధారక సప్తాహం

## డిసెంబరు 25 నుండి 31 వరకు

## ఆంధ్రు లాబాల గోపాలమూ ఉత్సవాలు జరిపి, ఈ ఆంధ్ర భోజుని స్మరించండి!

### కార్యక్రమము.

ఈ ఉత్సవమును జయప్రదముగ కొనసాగించుటకు ఆ యా మండలములందు వెంటనే స్మారక సంఘముల నేర్పాటుచేసి "దేశోద్ధారక స్మారక సంఘము" 7, తంబుచెట్టివీధి, జి. టి. మదరాసుకు (కేంద్ర సంఘమునకు) తెలియ జేయ ప్రార్థితులు.

1. ప్రతియూర స్మారక నిధికి చందా వసూళ్ళు చేయుట.

2. శ్రీ నాగేశ్వరరావు పంతులుగారి చిత్రపటములు, పతాకలు మొదలైన వానిని అమ్మి ఆ మూలముగ విరాళములు ప్రోగుచేయుట. (చిత్రపటములురసీదులు వగైరాలు కేంద్రసంఘం వారే మండల సంఘలకు సకాలములో అంద జేయుదురు)

3. స్మారక సభలను, ఉత్సవములను, నగరసంకీర్తనాదికములను ఏర్పాటు చేయుట.

4. ఆయాపట్టణములందు నాటక ప్రదర్శనములు, హరికథలు, సంగీతకచ్చేరీలు వగైరాలు ఏర్పాటు చేసి అందువల్ల వచ్చు ఆదాయము స్మారకనిధికి అంపుట.

5. పురపాలకసంఘములు, స్థానికసంస్థలు, వాణిజ్య సంఘములు, ఏమాకంపెనీలు మొదలయిన సంస్థలచేత విరాళములను వేయించుట.

6. ఆయాప్రదేశములందుండు సినీమా నిర్వాహకులచేత స్మారకనిధికి గాను ఉచిత ప్రదర్శనము లిప్పించుట.

విరాళములను ఆయా జిల్లాలయందుండు కోఆపరేటివు బ్యాంకుకు గాని, మదరాసు ప్రావిన్షియల్ కోఆపరేటివు బ్యాంకుకు గాని పంపవచ్చును.

# జమీందారీ బిల్లు ఈనాములకుకూడా వర్తించాలి

బ్రహ్మశ్రీ శ్రీ గిరిరాజు సత్యనారాయణ

ఎస్టేటు అగ్రహారాలు, మొఖాసాలలో "మేలువారం" "కుడివారం" హక్కులు రైతుకే ఉండవలెనను ఆందోళనచాలాకాలమునుంచి జరుగుచూవచ్చినది. జమీందారీ విచారణసంఘ రిపోర్టు ప్రకారం, జమీందారులకు నిచ్చేఆదాయం తగ్గుతుంది; రైతు 136 సంవత్సరముల క్రితము ఏమిచెల్లించెనో యీ రోజు అదే చెల్లించవలసిఉంది. రైతులకు నీటిపారుదల అడవులు, చెరువులు, స్మశానములు గ్రామకంఠములలో పూర్తి హక్కులున్నవి. సర్వేఖర్చు ప్రభుత్వం జమీందారు భరించుతారు. యింతవరకు రైతుకు లాభకరముఐనదే కాని యీనాము రైతుకు మాత్రం యీ రిపోర్టుఅన్యాయము చేసింది. యీ కమిటీ వారు యీనాములను మూడు రకములుగా విభజించారు. (1)1802 కు పూర్వము ఎప్పటినవి మరియు 1802లో జమీందార్లకు ప్రభుత్వం పేష్కస్ నిర్ణయించినప్పుడు ఎస్టేట్లలో ఏమిసంబంధములేని యీ నాములు-(2)1802 లో ఎస్టేట్లకు పేష్కస్ నిర్ణయించినప్పుడు ఎస్టేట్లలెక్కలలోవున్న యీ నాములు ఈ తరగతి యీ నాములకు బిల్లువర్తించును. (3)1802 కు తరువాత ఏర్పడ్డ యీ నాములు.

మొదటిరకపు యీ నాములు మహమ్మదీయ రాజులు యిచ్చినవి. యీ అగ్రహారములు ఎవరు ఎవరికి యిచ్చినదీ, తెల్పుకాగితములు లేవు. కాలక్రమేణా నన్నిగల్లికొద్ది పూర్తిఅగ్రహారములు మాత్రమే మిగిలియున్నవి. వీటికి ప్రభుత్వము మొదటిసారి పట్టాలు యిచ్చినప్పుడు 50 ఏండ్లు ఏ అగ్రహారందారు పేరుతో ఉన్నవో వారికే పట్టాలుయిచ్చినది. అప్పుడు రైతులను విచారించియుండలేదు. 1862 లో రైతులు ఆందోళనచేసిన మీదట రైతుల హక్కులకు భంగం కలుగకుండా ఒక చట్టం చేసినది. అచట్టములో ఎవరి హక్కులు ఏమయినవి నిర్ణయించి యుండలేదు. 1936 లో పాప్పిలి ప్రభుత్వము చేసిన చట్టము అగ్రహారందారు హక్కులేవో రైతుహక్కులేవోనిర్వచించి, మేలివారం హక్కులు వారికిచ్చింది. యీ చట్టమువల్లవచ్చిన హక్కుల కొరకు రైతులు నేడు అగ్రహారందారులతో పోరాడుచున్నారు. యీ పోరాటములు తీవ్రమగుచున్న సమయములో కాంగ్రెసు ప్రభుత్వము యీ రైతులకు కీయబడిన హక్కును లాగివేసింది. దీనివల్ల ప్రభుత్వముతో రైతులు పోరాడవలసిన పరిస్థితులను కాంగ్రెసు ప్రభుత్వమే కలిగించుట బహు విచారకరము. యీనాం రైతులు యీ సూచన నెదిరించి తిరుగుటలో ఆశ్చర్య మేమి యుండదు.

రెండవరకము అగ్రహారములను, అనగాచట్టము వర్తించు అగ్రహారములను, ఇవి అను నిర్వచనము చేయుట కష్టము. ప్రభుత్వమే ఏయే అగ్రహారములకు చట్టము వర్తించునో జిల్లాల వారీగా ప్రకటించిన చాలా దావాలు తగ్గును. రైతులకు మేలుచేసి, ప్లీడరులకు పని తగ్గించిన వారగుదురు.

మూడవ రకమైన అగ్రహారములు ఎలాగూ చట్టరీత్యా సమ్మతములు గావు. కాబట్టి వాటి విచారణ యిచ్చుట అనవసరము.

మొదటి రకపు అగ్రహారములలో జేయుచున్న అల్లరులను గూర్చి ప్రభుత్వము సంపూర్ణముగా విచారించినది. అగ్రహారం దారుల దుండగములను గమనించినది. 144, 107, యింకా యితర సెక్షనులు, యింజంక్షనులు, రైతుల చేతులలో నుంచి అగ్రహారం దారు పొలములను లాగు కొనుటకు ఎలా వుపయోగించుచున్నాదో అందరికి తెలిసిన విషయమే. ఒకసారి రైతుల కీయబడిన హక్కును ప్రభుత్వము లాగుట చాలా అన్యాయము. రిపోర్టులో, "యీనాములకు ప్రత్యేక చట్టములున్నవి, 1871 లోనే యీనాముల వ్యవహారములను విచారించుటకు సివిల్ కోర్టులకు హక్కుల నిచ్చిరి." అని నెపముమీద పెద్ద అగ్రహారములను మైనరు యీనాములతో సమముగా చూచుట వల్ల, యితర పార్టీల వారు చేసిన మంచి చట్టమును యీ ప్రభుత్వము తొలగించుట.

కాన కాంగ్రెసు మంత్రివర్గము వీలయినచో ఎస్టేటు ల్యాండు రెవిన్యూ బిల్లు యీనాములకు, అగ్రహారాలకు వర్తించు నటుల సవరణ చేయాలి. లేదా యీ బిల్లుతోపాటు యీనాము రైతులకు కూడ యిట్టి హక్కుల నిచ్చు వేరొక బిల్లు ప్రవేశ పెట్టవలెను. లేనిచో యీనాము రైతులకు చాల అన్యాయం జరుగుతుంది. యీసంగతి కాంగ్రెసు శాసన సభ్యులు రివెన్యూమంత్రి ప్రకాశంగారు గమనించాలని కోరుచున్నాను.



## రైల్వే కార్మికులయెడల కాంగ్రెసు

# ఉదాసీనత వహించుట మంచిదికాదు

శ్రీ డి. యస్. వైద్య
(జి. ఐ. పి. రైల్వే కార్మిక సంఘ కార్యదర్శి)

సామ్రాజ్యవాద గవర్నమెంట్లు శాంతియుతంగా సాగాలంటే రైల్వే పరిశ్రమ సక్రమముగా నడవాలి. ఆ పరిశ్రమలలోని అశాంతి చాలా ప్రాముఖ్యత వహించింది. హిందూ దేశము మొదలగు బానిస దేశాలలో ట్రాన్సుపోర్టు పరికరాలు, వాటిపై అధికారము ముఖ్యమైన సమస్య. సామ్రాజ్యవాద గవర్నమెంటు చేతులలో రైల్వేలు వుంటేగాని, ఒకచోటి నుంచి మరొక చోటికి మిలిటరీని, పోలీసులను త్వరలో తిప్పడానికి వీలుండదు.

### హిందూదేశ రైల్వేలు.

హిందూదేశములో 14 ఎ క్లాసు రైల్వేలున్నవి. అందులో 4 ప్రభుత్వము చేతనే నడపబడుతున్నవి. తక్కినవి కంపెనీల పెత్తనం క్రింద వున్నప్పటికి అధికారమంతా గవర్నమెంటు చేతులో ఉన్నది. హిందూదేశ రైల్వేల మీద పెట్టుబడి 800 కోట్ల రూపాయలు. 750 కోట్లు బ్రిటిష్ పెట్టుబడిదార్లవి. 58,000 మైళ్ళు రైల్వే లైనువుంది. మార్చి 1937 ఆఖరికి రైల్వే పరిశ్రమలో పని జేస్తున్నవారు 7,10,880.

### రైల్వే ఆదాయం పంపకము.

రైల్వే ఆదాయం యీ క్రింది విధంగా లెక్కవేస్తారు.

1. పెట్టుబడికిగాను వడ్డీ.
2. సామానుల రైళ్ళు నడచుటకుగాను ఖర్చు.
3. పనివారల వేతనాల బిల్లు.

ఈ ఆదాయములో పెట్టుబడికి గాను వడ్డీ చాలా ముఖ్యమైన భాగము. బ్రిటిష్ పెట్టుబడిదారులకు, వారి పెట్టుబడి పెట్టిన డబ్బుకు వడ్డీ గ్యారంటీ చేయబడింది. సంవత్సరమునకు 33 కోట్ల రూపాయలు యిందుకుగాను యివ్వాలి. 1929 సంవత్సరం నుండి 1937 సం॥ లోపల 240 కోట్ల రూపాయలు వడ్డీ రూపంగా ఇంగ్లండుకు తీసుకొనిపోయినారు. పెద్ద పెద్ద ఉద్యోగుల జీతాలకు సంవత్సరమునకు 3 కోట్ల రూపాయలు యివ్వాలి. సంవత్సరమునకు 2 కోట్లు మిలిటరీలకుగాను వేయబడ్డ రైల్వేలకు ఖర్చగును. మొత్తం మీద రైల్వే ఆదాయములో 50 నుంచి 55% గ్యారంటీ చేయబడిన ఆఫీసర్ల జీతాలు, మిలిటరీ రైళ్ళకు ఖర్చు మింగివేస్తున్నయి. రైల్వే ఆదాయం తగ్గినా, హెచ్చినా యీ (ముడుపు) fixed charges తప్పకుండా చెల్లించాలి. తరువాత రైల్వేలను నడుపుటకు కావాలసిన సామానులన్నింటికి డబ్బు యివ్వాలి. ఈ సామానులు కూడా ఇంగ్లండు నుంచి దిగాలి.

### పనివారల వేతనాలు.

రైల్వే ఆదాయములో, గ్యారంటీ చేయబడిన ఖర్చులకు, రైల్వే సామానుల ఖర్చు పోగా మిగిలినది పనివారల జీతాలకోసం ఉపయోగిస్తారు. రైల్వే ఆదాయం తగ్గినప్పుడల్లా ఆ నష్టం రైల్వే పనివారలు భరించవలసి వస్తున్నది. కొద్ది సంవత్సరాల నుంచి ఆర్థిక మాంద్యమువల్ల రైల్వే ఆదాయం తగ్గుతూ వచ్చింది. కాని బ్రిటిష్ పెట్టుబడిదారులకు వడ్డీ, ఆఫీసర్ల జీతాలు, సామానులకుగాను ఖర్చు సక్రమముగానే సాగుతున్నది. ఆర్థిక మాంద్య ఫలితము, (1) పనివారలను తగ్గించుట. (2) జీతాలు తగ్గించుట. (3) సౌకర్యాలు తగ్గించుట. (4) పని ఎక్కువచేయుట.

### (6 సంవత్సరాలలో) 1,10,000 మందిని తగ్గించారు.

1929-30 సం॥ రైల్వే పరిశ్రమలో పనిజేసేవారు 8,17,733. 1930-31 సం॥ 36,000 తగ్గించబడ్డారు. 1931-33 సం॥ లోపల 70000 మంది తగ్గించబడ్డారు. 1936-37 లో 710, 880 మందిని తగ్గించారు. మొత్తం మీద 1 10, 000 మంది రైల్వే పనివారలను తీసివేసారు. అందు జి. ఐ. పి. లోపని జేసేకార్మికులను ఎక్కువమందిని. తగ్గించారు. 1929-30 లో 1, 16, 054 వుంటే 1936-37 కు 81, 439 మందిమాత్రమే పనిజేస్తూన్నారు. అదే విధంగా బి. బి. సి. ఐ. రైల్వేలో కూడా 10, 000 మందిని తగ్గించారు. పనివారలు తగ్గుటచేత, పని జేసే కార్మికుల పని మరింత ఎక్కువయింది. రైల్వే లైను రోజురోజుకు పొడుగించబడుచున్నది. పోపు కమిటీవారి సలహాలమూలకంగా అపరిమితంగా ఎక్కువయింది.

### కంట్రాక్టు పద్ధతి.

దొరల దోపిడీ విధానము లక్షమంది పైగా పనివారలను తగ్గించుటతోనే పూర్తిగాలేదు. రైల్వేబోర్డువారు కొత్త జీతాల పద్ధతి అమలు జరిపారు. క్రొత్త జీతాలు సామాన్య మనిషి జీవనం చేయటానికి కావలసిన దానికన్న తక్కువగా ఉన్నవి. రోజు రోజుకు పెరిగిపోతున్న నిరుద్యోగసమస్యవల్ల శ్రమ శక్తి ధర పడిపోతున్నది. ప్రస్తుతమున్న ధరనుబట్టి జీతాలు నిర్ణయించబడ్డవి. క్రొత్తజీతాల పద్ధతివల్ల జీతాల బిల్లుకు గాను ఖర్చు 25 నుంచి 50% తగ్గించుకున్నారు. దొరలు ఇంతటితో సంతృప్తి చెంద లేదు. కంట్రాక్టు పద్ధతి అమలులో పెట్టారు. రైల్వే పనిలోనుంచి తీసివేసిన వారిని యీ కంట్రాక్టుదారులు కొద్ది జీతాలకు పెట్టుకుంటారు. పూర్వము రైల్వేఅధికారులు గుంటలలోనుంచి కాలిపోయిన బొగ్గును తీసేందుకు మనిషికి 18 నుంచి 23 రు॥ యిచ్చేవారు. ఇప్పుడు ఆ పనికి గాను కంట్రాక్టుదారుడు రోజుకు 8 అణాలవంతున చేయిస్తున్నాడు. గూడ్సు వాగిన్‌నుండి సామానులు దించుటకు ఎత్తుటకు కంట్రాక్టు కూలీలద్వారా చేయిస్తారు. ఈపనిలో కూడా జీతాలు చాలా స్వల్పము. బాలెస్టుపర్కుకూడా కంట్రాక్టుల ద్వారా చేయిస్తూ ఉన్నారు. ఇందులో రోజుకు 3 అణాలకు, 5 అణాలకు కూడా పని చేస్తూవున్నారు. సంసారంతో కూడా రైల్లో ఒకచోటనుంచి ఒక చోటికి వెళ్ళి ఎండలో, వానలో పనిచేయాలి. వీరి పనికి గాను వచ్చిన రైల్వే ఆదాయములో fixed charges క్రింద దొరలు తీసుకుంటారు.

### సౌకర్యాలు తీసివేసారు.

జీతాలు తగ్గించటమే కాకుండా పనివారలు పొందుచున్న కొద్ది సౌకర్యాలలో తగ్గించటం ప్రారంభించారు. 1925 తరువాత చాలామంది రైల్వేఉద్యోగస్థులకు ప్రావిడెంటుఫండు లేకుండా చేశారు. క్రొత్త లీవు రూల్సు క్రింద మొదటి మూడు సంవత్సరాల సర్వీసులో సెలవలు లేకుండా చేసారు. సంవత్సరమునకు 15 రోజులు సెలవల్లా 10 రోజులకు తగ్గించారు. ప్యాసు రూల్సు మార్చారు. ప్యాసులు తగ్గించారు. డిపెండెంటుప్యాసులు తీసివేసారు. చాలా సంవత్సరములనుండి ప్రొమోషన్లు ఆపివేశారు. వేలకు వేలమంది రైల్వే ఉద్యోగస్థులకు ఇంటి సౌకర్యాలు లేవు. ఇంటిఎలవెన్సులు తగ్గించారు. ఈవిధంగా వేతనాల బిల్లును తగ్గించారు.

### శిక్షలు—ఉద్యోగములోనుండి తీసివేయుట.

జీతాలు తగ్గినవి. ఉన్న కొద్దిసౌకర్యాలు పోతున్నవి. పని ఎక్కువగుచున్నది శిక్షలు, ఉద్యోగాలనుంచి తొలగించుట రోజురోజుకు ఎక్కువగుచున్నవి. ఉద్యోగాలు గ్యారంటీగా వుంటవనే ఆశ పోతున్నది. కొద్ది తప్పులకు గొప్ప గొప్ప శిక్షలు విధించుచున్నారు. కార్మికులను భయపెట్టుటకు రైల్వే దొరలు యీపనులు చేస్తూవున్నారనుటలో సందేహం లేదు.

### ఋణబాధ.

ఋణబాధవల్ల రైల్వే కార్మికుల జీవితం రోజు రోజుకు అధోగతి అగుచున్నది. జీతాలు తగ్గటంవల్ల, నిరుద్యోగం రోజు రోజుకు ఎక్కువగుటచేత అప్పులు చేయాలసి వస్తున్నది. 20,000 కార్మికులు జి. ఐ. పి. రైల్వే పనివారల కోఆపరేటివు బ్యాంకు నుంచి అప్పులు తీసారు. షాహుకార్లు వందలకొలది కార్మికుల జీతాలకు అటాచ్‌మెంట్లు పెడుతున్నారు. కాబూలీలు మొదలగు దోపిడిగాండ్రచేత జీతాలు తీసుకునే రోజున కార్మికులు అనేక అవస్థలకు పాలగుచున్నారు పోలీసుల ఎదుటనే కార్మికుల చేతులలో నుంచి వడ్డీవ్యాపారస్థులు డబ్బు లాక్కుంటూ పున్నారు. పట్టపగలు ఈ దోడిడీ విధానము సాగుతున్నది.

### కార్మికుల పోరాటాలు.

నిర్బంధ దోపిడీ విధానము యొక్క ప్రతిఫలము కార్మికుల పోరాటాలే. 1929 నుంచి 1936 వరకు అనేక రైల్వేలలో బ్రహ్మాండమైన సమ్మెలు జరిగినవి. 1930 లో 80,000 జి. ఐ. పి. రైల్వే కార్మికులు యజమానుల వత్తిడిని ఎదుర్కొన్నారు. ఆ అవకాశమును సరిగా వినియోగించుకొనిన చరిత్ర తారుమారు అయి వుండాలసినది. బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో ప్రజాసామాన్యము ప్రత్యక్ష పోరాటము సాగించిన రోజులలోనే ఈ సమ్మె వచ్చింది. శాసనోల్లంఘనపు రోజులవి. 1930 ఫిబ్రవరి 4 వ తేదీ సమ్మె ప్రారంభము కావలసినది. స్వాతంత్ర్యదినోత్సవమైన జనవరి 26 వ తేదీనే ప్రారంభమైంది. కార్మిక నాయకులు భారత జాతీయ కాంగ్రెసు సహాయం కోరారు. కాంగ్రెసు

(మిగతా 18 వ పేజీలో)

# ఆంధ్ర దేశములో కార్మిక పోరాటాలు

## గుడివాడ

పాకీ పనివారి సంఘం

గుడివాడ పాకీపనివారు 12-12-38 వ తేదీని సమావేశమై శ్రామేష్ రెట్టిపల్లి వెంకటసత్యం గారిని అధ్యక్షులుగాను, వన్దాడి వల్లయ్యగారిని కార్యదర్శిగాను, మరి 8 మంది గల కార్యనిర్వాహక వర్గాన్ని, ఎన్నుకొన్నారు. ఈ దిగువ కోర్కెలను నెరవేర్చవలసినదని మునిసిపాలిటీ వారిని కోరుతూ తీర్మానించారు.

1. గూడెంలో రెండు ఎలక్ట్రిక్ లైట్లు వేయాలి. 2. సినిమా హాలు ముందున్న నూతిని బాగుచేయించి మురుగుకాల్వవల్ల నుయ్యి పాడు కాకుండా చేయాలి. 3. సినిమాహాలునుండి వచ్చు మురుగు నీరు పోవడానికి సైమకాల్వ త్రవ్వించాలి. 4. నగరములో నున్న 6 పాకీదొడ్లకు 6 గురు మనుష్యులను నియమించాలి. 5. పాకీవాండ్రకు నెల 1 కి 12 రూపాయలున్న జీతం ఎక్కువ ఇవ్వరాదనే జి. ఓ. ను రద్దుచేసి, ప్రతి ఒక్కనికి 20 రూపాయలు జీతం ఏర్పాటు చేయించాలి. 6. పాకీవాండ్రకు ప్రాణిదెంటు ఫండు, పెన్షన్లు, గర్భిణీ స్త్రీలకు రెండునెలలు జీతముతో కలిపి, చిన్నపిల్లలకు ఉచిత విద్య, పెద్దవారికి రాత్రిపాఠశాల, పాకీవాండ్రకు చెప్పులు, వంటిపిల్లలకై డ్రెస్సు, క్యాజువల్ లీవు, ప్రివిలేజి లీవు ఒకనెల, వర్షాలనుండి పని సమయంలో రక్షించుకోడానికి ప్రత్యేకపు కోట్లు, ఇండ్లు లేనివారికి ఇండ్లు, ఏర్పాటు చేయించాలి.

## బందరు

లక్ష్మీ ప్రెస్సులో సమ్మె.

బందరుప్రెస్ పనివాళ్లు యీ దిగువ కోర్కెలను నెరవేర్చవలసినదని ప్రెస్ యజమానులను కోరుతున్నారు:— 15 రోజులు క్యాజువల్ లీవు, ఓవర్ టైముకు రెట్టింపు జీతం, పండగలకు గవర్నమెంటు సెలవులకు జీతంతో కలిపి, సంవత్సరము పైగా పని చేసే కుర్రవానికి 10 రూపాయల జీతం, ప్రతినెల 7వ తేదీకి పనివాళ్ల జీతాలు, ఏర్పాటుచేయాలని కోరుతున్నారు.

ఉప్పాను రోజులలో పనికిరాలేక పోయినందుకు గైరుహాజరువేయవద్దనియు, ఓవర్ టైము 6 గంటల నుండి 4 గంటలకు మార్చి రెట్టింపు జీతం ఇవ్వవలసిందని, ఉప్పాను అయినప్పటినుండియు, పనివాళ్లు యజమానులను కోరారు. ఉప్పానురోజులలోనాగాలు పట్టుకుంటుటకును, ఓవర్ టయిము 4 గంటలు చేయడానికి, యజమానులు అంగీకరించారు. లక్ష్మీప్రెస్ యజమాని మాత్రం నిరాకరించెను. ముస్తాఫా అను పనివాడను 12 వ తేదీ రాత్రి పనిలోకి రావలసినదని యజమాని చెప్పెను. యజమానిచెప్పేరేటుకి పనిచేయడం ఇష్టంలేక ముస్తాఫారాత్రి పనికి వెళ్లక, మరునాడు ఉదయమే పనిలోకివెళ్లగా, అతనిని-యజమాని పనిలో నుండి తొలగించెను. చట్టప్రకారం నడుచు కోడానికి నిరాకరించేవాళ్లందరిని యజమాని పనిలోనుండి వెళ్లిపొమ్మనెను. అందుచే అందరుపనివాళ్లూ 13 వ తేదీ నుండి సమ్మెప్రారంభించారు.

## కళింగపట్నం

పోర్టు కార్మికుల సమ్మె

కళింగపట్నం పోర్టుకార్మికుల జీతాలు రోజుకు 2-4-0 నుండి 1-12-0 అణాలకు తగ్గించుటచే ఓడవచ్చేరోజయిన 6-12-38 తేదీని సమ్మె చేశారు. ఒకనెల క్రిందటనే వీరిసంఘం ఏర్పాటు చేయబడినది. యీ సంఘాధ్యక్షులు కార్మికుల ఇబ్బందులను గురించి మద్రాసు ప్రభుత్వం వారికి తెలియజేశారు. యజమానులు భీముని పట్నంనుండి కార్మికులను తీసుకవచ్చి పనిచేయించారు. సమ్మెజరిగిన రోజునే పోలీసు అధికారులు సిబ్బందితో కావలాకై హాజరయ్యారు.

## కాకినాడ

స్త్రీ మరి కూలీల సమ్మె.

నెం రోజులక్రిందట, అన్యాయముగా తీసికొనబడే మామూళ్లు నరించాలని కూలీహెచ్చాలని యింకా కొన్నిహక్కులతో, కంపెనీలకూ, కంపెనీ మనేజరుకూ పదిది స్త్రీలును కూలీల సంఘకార్యదర్శిగారు వ్రాశారు. కొంత ఆలజడిపై, మనేజర్పప్పుకొని, నిజమైన కూలీ యిచ్చారు. తమసరియైనాక మనేజరుకంపెనీ (రామ్ అండ్ చటర్జీ కంపెనీ) మొదట అమామూలు ఒప్పుటకు నిరాకరించింది. 9 వ తేదీ కంపెనీయిచ్చే కూలీని 160 కూలీలు తీసికొన నిరాకరించారు. కూలీయివ్వనిచో మరలవచ్చే ఆ కంపెనీ స్టీమర్లకు చెక్కకుండా కూలీల ప్రవేశాలన్నిటికీ, వార్తలు పంపబడ్డాయి. కంపెనీ ఆసలు ఏజంటు రప్పించబడ్డారు. 11 వ తేదీ సరియైన కూలీనిచ్చుటకు అంగీకరించారు. వెంటనే గొప్పఊరేగింపుతో సమ్మె ఆపివేయబడెను.

పాకీవాళ్ల సమ్మెయూ:

పాకీవారికోర్కెలను ఆలోచించ మ్యునిసిపాలిటీ వారు నిరాకరించారు. పాకీవారిలో అసంతృప్తి బయలుదేరు తుంది. మ్యునిసిపల్ అధ్యక్షులు: "సమ్మెవలన దప్పయిది పరిష్కారము గావని" చెప్పటం సమ్మె తప్పదేమోనని తోస్తుంది.

## చిట్టివలస

చిట్టివలస కార్మిక తగాదా సందర్భంలో కలెక్టరుగారు కలుగ జేసుకొని, 15 రోజుల నోటీసు ఇచ్చిన పిదపనే కార్మికులను తీసివేయవలసినదని యజమానులతో చెప్పెను. 12 వ తేదీ నుండి మిల్లు పని ప్రారంభించుటకు కార్మికులూ యజమానులూ అంగీకరించారు.

---

## రైల్వే కార్మికులు

(17 వ పేజీ తరువాయి)

నాయకులు, సమ్మెదారులకు సహాయం నిరాకరించారు. రాజకీయాలకు, రైల్వే కార్మికుల సమ్మెకు సంబంధము లేదని వాదించారు. పైగా రాజకీయ సంస్థ సహాయం చేస్తే కార్మికులకు నష్టం వాటిల్లునని చెప్పారు. బ్రిటిష్ పెట్టుబడిదారి దోపిడీ విధానమునకు వ్యతిరేకముగా 80,000 రైల్వే కార్మికులు జాతీయ కాంగ్రెసు సహాయము లేకుండా పోరాటము సాగించవలసి వచ్చింది. సామ్రాజ్యవాద గవర్నమెంటు వణకింది ఆ రోజులలో. హిందూదేశ ప్రజాసామాన్యమంతా తిరగబడతారేమో నని భయపడింది. ఆరోజుల్లో జాతీయకాంగ్రెసు సమ్మెదారులకు సహాయం చేసివున్నా, లేక జాతీయ ఉద్యమములో కార్మిక పోరాటం క్రోడీకరించినా, బానిసలుగా వున్న మనము, స్వాతంత్ర్యము అనుభవించుచుందేవారమే. జి. ఐ. పి. రైల్వే కార్మికులు, స్త్రీలు, పిల్లలు పై వ్యసాహసముతో ఒంటరిగా పోరాటం సాగించారు. చివరకు బ్రిటిష్ సామ్రాజ్యవాదులు కార్మికపోరాటమును అణచివేసారు. సమ్మెయెడల కాంగ్రెసు నాయకుల దృక్పథము, సమ్మెను నాశనము చేయుటకు, గవర్నమెంటుకు తోడ్పడింది. దాని ఫలితముగా జాతీయోద్యమమును కూడా అణచగలిగారు. రైల్వే కార్మికులను జాతీయ ఉద్యమములోనికి తీసుకువచ్చే అవకాశమును నాశనము చేసారు కాంగ్రెసు నాయకులు. అదేవిధంగా అనేక రైల్వేలలో సమ్మెలు వచ్చినవి. బి.యన్.ఆర్. సమ్మె, యన్. జి. యస్. సమ్మె, యం. యస్. యం. సమ్మెసందర్భంలోకూడా ఈతప్పులే చేసారు. ఎన్నికల సమయంలో వచ్చిన బి.యన్.ఆర్. సమ్మెకు మాత్రం నైతిక సహాయము ఇచ్చారు.

<u>రైల్వేకార్మికులు—జాతీయ పోరాటము.</u>

ఈ రోజున త్రైల్వేలపైన మనకు అధికారంలేదు. ఫెడరేషన్ వచ్చినతరువాత, కేంద్రశాసనసభలో రైల్వే అధికారులను విమర్శించే కొద్ది హక్కుకూడా పోతుంది. ఫెడరల్ రైల్వే అథారిటీకి, హిందూదేశ ప్రజలకు, కేంద్రశాసన సభ ఎట్టి సంబంధముండదు.

కాంగ్రెసు ఈ రోజున రైల్వేలు ప్రజలపరం కావాలని కోరాలి. (బిటిష్ పెట్టుబడిని తిరిగి యిచ్చి వేయాలని కోరారు.) తక్కువ వడ్డీరేటుతోనే హిందూదేశములో పెట్టుబడిని కూర్చాలి. రైల్వే ఆఫీసర్ల జీతాలుతగ్గించాలని కాంగ్రెసుకోరాలి. వీటిపైన తీవ్ర ఆందోళనజరగాలి..నూతన ఫెడరల్ రైల్వే అథారిటీని ప్రతిఘటించాలి. స్వాతంత్ర పోరాటమునకు యీ కోర్కెలాముఖ్యము దోపిడీవిధానమునకు వ్యతిరేకముగా జరిగే రైల్వేకార్మికుల పోరాటమునకు కాంగ్రెసు తోడ్పడాలి. రైల్వేపనివారల సంఘములను ఎదుర్కొనుచున్న సమస్యలను పరిష్కరించాలి. రైల్వే కార్మికుల ఆర్థిక హక్కులకొరకు జరిపే పోరాటమునకు పూర్తి సహాయము యివ్వాలి. యువకులు రైల్వేకార్మికుల సంఘములను బలపరచుటకు కృషి చేయాలి. స్థానిక కాంగ్రెసు కమిటీలు స్థానిక రైల్వే కార్మికుల సంఘములభివృద్ధికి తోడు, బ్రిటిష్‌సామ్రాజ్యవాదులతో పోరాటమునకు ముఖ్యవసరమైన, రైల్వే కార్మికుల సానుభూతిపొందాలి.



# తూ॥ గో॥ జిల్లా విద్యార్థి మహాసభ

విద్యార్థిమహాసభ 10, 11 తేదీలలో జయప్రదంగా జరిగింది.

10 వ తేదీ ఉదయం 350 మంది విద్యార్థులు జండాలతో, ప్లేకార్డులతో, నినాదాలు పల్కుతూ ఊరేగారు. టౌనుహాల్‌వద్ద జాతీయ పతాకం ఉదయం 8 గంటలకు పైగా వెంకటనారాయణ (సిటీ కాంగ్రెస్ అధ్యక్షులు)గారిచే ఎగురవేయబడింది.

విద్యార్థి పతాకోత్సవం, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ సంయుక్త కార్యదర్శి కామ్రేడ్ పొన్నలగడ్డ రామలింగయ్యగారిచే జరుపబడింది.

సాయంత్రం 3 గంటలకు సభ ప్రారంభమయింది. ఆహ్వానసంఘాధ్యక్షులు, ప్రతినిధులను, విద్యార్థులను ఆహ్వానించుచూ ఆంధ్ర యూనివర్సిటీమెంబరగు డాక్టర్ యం. వి. కృష్ణారావు గారిని సభను ప్రారంభించమని కోరిరి. మద్దూరి అన్నపూర్ణయ్య గారధ్యక్షత వహించారు.

ఆమోదింపబడిన తీర్మానాలు.

1 ఆంధ్ర యూనివర్సిటీ.

(a) ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు నూతనంగా ప్రవేశపెట్టిన విద్యార్థుల హక్కులను భంగం గావించు రెగ్యులేషన్లపట్ల అసమ్మతితెలియజేస్తూ, రేగ్యులేషన్ల నుపసంహరించుకోవలెనని ఆంధ్ర విశ్వవిద్యాలయము వారిని కోరుచున్నారు

(b) విద్యార్థులు తమ హక్కులకైపోరాడుచుండ అవి ఆమోదించక, నిర్బంధచర్యలు గావించిన ఆంధ్రయూనివర్సిటీ అధికారుల చర్యలను ఈ సభవారు ఖండించుచున్నారు.

(c) బొంబాయి విశ్వవిద్యాలయమునందు వలె న్యాయశాస్త్రపరీక్షకు ఇంటర్మీడియెట్ పరీక్షయందు కృతార్థతయే కనీసమైనదిగాబెట్టి ఈ విశ్వవిద్యాలయమునగూడ న్యాయశాస్త్ర విద్య ప్రవేశపెట్టవలసినదని, ఈ సభవారు అధికారులను కోరుచున్నారు.

(e) ఆంధ్ర విశ్వవిద్యాలయమున M.A. (యం. ఏ.) పరీక్షకూడ పెట్టవలెనని ఈ సభవారు కోరుచున్నారు.

(f) దేశచరిత్ర, భూగోళ శాస్త్రములను క్లాసునందు చెప్పుచూ పరీక్షలందు తీసివేయవలెనని ఈసభవారు కోరుచున్నారు.

(g) దినముకొక పరీక్ష పెట్టవలయునని ఈ సభవారు కోరుచున్నారు.

(h) స్కూలు ఫైనల్ పరీక్షకు 15 సంవత్సరముల కన్న తక్కువ వయస్సు వారిని కూడ పంపవలెను.

(i) సెలక్షన్ పరీక్షలలో డిటెన్షన్ పద్ధతి యుండరాదని ఈ సభవారు కోరుచున్నారు.

(j) స్కూలు జీతాలను సాధ్యమైనంతవరకు తగ్గించాలని ఈ సభవారు కోరుచున్నారు

2. మద్రాసు ప్రభుత్వం

(a) ప్రభుత్వోద్యోగములుగాని, విద్యాలయములలో సీట్లుగాని కులమునుబట్టిగాక శక్తిని బట్టి యొసగుట కాంగ్రెసు పద్ధతి గాన అట్లు చేయ ప్రయత్నింప వలెనని కాంగ్రెస్ ప్రభుత్వము వారిని కోరుచున్నారు.

(b) మద్రాసు ప్రభుత్వమువారు మద్రాస్ ఎడ్యుకేషనల్ రూల్సులో లోగడ గావించిన మార్పులు, విద్యార్థి లోకమునకు మిక్కిలి హానికరము గావున, ఉపసంహరించు కొనమని ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

(c) నిర్బంధ ఉచిత ప్రాథమిక విద్యావిధానము, సైనిక శిక్షావిధానము ఉండవలెననియు, వాటిని ప్రవేశపెట్టమనియు, ప్రభుత్వము నీ సభవారు కోరుచున్నారు.

3. ఇతర తీర్మానాలు

కెమాల్‌పాషా, షౌకతాలీ మృతికి సానుభూతి తెల్పుచూ; ఉస్మానియా కాలేజీ, కాశీ విశ్వవిద్యాలయ ఇంజనీరింగు శాఖ, బెజవాడ విద్యార్థుల సమ్మెలపట్ల సానుభూతి తెల్పుచూ: సి. ఐ. డీ. లు వెంటబడుట జాతీయోద్యమానికి హానికరం గావున, సి. ఐ. డీ. లను తీసివేయమని ప్రభుత్వాన్ని కోరుతూ; కామ్రేడ్ ధరిత్రీ గంగూలిని అరస్టు గావించిన బెంగాల్ ప్రభుత్వాన్ని ఖండించుతూ; భద్రాచలం హైస్కూలులో 1—3 వ తరగతులకు క్రొత్తగా పెట్టిన 10 అణాల జీతం, 1—8 ఫారాలకు అదనపు నెల జీతం తగ్గించవలెనని కోరుతూ; ప్రత్యేకాంధ్రరాష్ట్ర విషయమై వర్కింగు కమిటీవారి చర్య ఆశాభంగకరంగా ఉన్నదిగాన ఈ విషయం, వారు తిరిగి ఆలోచించవలసినదని ప్రార్థించుచూ; ప్రపంచశాంతికి భంగకరమైన మ్యూనిక్ ఒడంబడికను గావించిన ఛంబర్లేన్ ఛాంబర్లేనుల అవమాన చర్యలను ఖండించుచూ తీర్మానాలు గావించబడినయి.

11 వ తేదీ సాయంత్రము శ్రీ. రామలింగయ్య, మునిగంటి జగ్గన్నశాస్త్రి, తుమ్మల వెంకటరామయ్య, దేవులపల్లి కృష్ణశాస్త్రి, సి. వి. కె. రావు మున్నగువారు వివిధ విషయాలమీద ఉపన్యసించారు.

రెండు రోజుల సభలలోను, విద్యార్థినులు ఉత్సాహవంతంగా పాల్గొని తమ కష్ట నిష్టూరాలను వెలిబుచ్చి చర్చలలో పాల్గొని సభను జయప్రదం గావించారు. (మా విలేఖరి)

కాకినాడ విద్యార్థుల ఊరేగింపు

## బెజవాడ విద్యార్థుల సమ్మె

బెజవాడ హిందూ హైస్కూలులో షుమారు 1000 మంది విద్యార్థులలోను 13—12—38 వరకు దాదాపు 30 మంది విద్యార్థులు కూడ పాఠశాల లోనికి వెళ్ళలేదు. 13—12—38 వ తేదీన ఆ స్కూలు హెడ్‌మాష్టరుగారు మామూలుగా జట్కామీద స్కూలుకు వచ్చిరి వారు జట్కాతోనే లోనికి వెళ్లుట అలవాటని, కనుక జట్కాని కూడ లోపలికి పోనివ్వవలెనని చెప్పిరి. విద్యార్థులు జట్కా బయట ఆపి వెళ్ళవలెనని కోరిరి. అందుకు వారు సమ్మతించలేదు ఎట్టకేలకు మాష్టరుగారు బండీతోనే లోపలికి వెళ్ళిరి. మునిసిపల్ హైస్కూలునందుకూడ పికెటింగు తీవ్రముగా సాగినది. ఈ మునిసిపల్ హైస్కూలుకు సరియయిన ప్రహరి (Compound)లేకపోవడమువల్ల పికెటింగు చాలా కష్టమైనది.

14, 15 తేదీల నుంచి హిందూ, మున్సిపల్ హైస్కూలుల్సు యందు అర్ధ సంవత్సరపు పరీక్షలు ప్రారంభము. 13 వ తేదీ రాత్రి సమ్మె కమిటి, ఉపాధ్యాయులను కూడ పికెటింగుచేయుటకు తీర్మానించిరి.

హిందూహైస్కూలులో మధ్యాహ్నము 2 గంటలనుంచిపరీక్షలు ప్రారంభము. సమ్మెయొక్క జయాపజయములను నిర్ణయించు దినముగా విద్యార్థులు భావించి, పికెటింగు మరింత తీవ్రముగా సాగించిరి, కొంతమంది విద్యార్థులు వేకువజామునకు పూర్వమే పాఠశాలలోనికి వెళ్ళి కూర్చునిరి, వీరి సంఖ్య 50కి మించదు, కొంతమంది వుపాధ్యాయులు లోనికి వెళ్ళుటకు ప్రయత్నించిరి. ఒక వుపదు వుపాధ్యాయులు విద్యార్థులను త్రొక్కుకునైననూ వెళ్ళుటకు ప్రయత్నించెను. కాని లాభములేకపోయినది. ఒక స్కూను వచ్చిన వుపాధ్యాయులందరిని హెడ్‌మాష్టరుగారు ప్రక్కన నిలబడివుండవలసినదని చెప్పినారు, విద్యార్థులు పరీక్షలులేవు, డిటెన్షన్లుపోవాలి పరీక్షలు వాయిదా వెయ్యాలి అనువాదము వేయటము ప్రారంభించిరి. హెడ్‌మాష్టరుగారుసరిగా రెండుగంటలకు మామూలుగా జట్కాబండిలో విచ్చేసిరి, విద్యార్థులు నమస్కారబాణము వదలి తిరిగి వెళ్ళవలసినదిగా కోరిరి, అక్కడ హెడ్ మాష్టరుగారు వుపన్యాసముచేయ ప్రారంభించిరి, కాని విద్యార్థులు వుపన్యాసములతో పనిలేదని, విద్యార్థుల కోర్కెలను సృష్టించవలెననికోరుచూ విద్యార్థి సంఘాలకు జై, డిటెన్షన్లుపద్ధతి పోవాలి యని నినాదములతో వాతావరణమంతను నింపివేసిరి. చివరకు హెడ్‌మాష్టరుగారు ఒక జాబు తీసి చదువుట ప్రారంభించిరి. దాని సారాంశము పరీక్షలు సోమవారమువరకు వాయిదా వేసినట్లు గురు శుక్ర వారములు స్కూలు మూసి వేయుచున్నారని తెలిసినది. ఇది నిజముగా విద్యార్థుల ప్రథమ విజయచిహ్నమే.

మరునాడు మున్సిపల్ హైస్కూలులో పరీక్షలు, ఉదయం10 గం॥లకే ప్రారంభము.విద్యార్థులు వేకువజామునుంచి కడు జాగరూకులై పికెటింగుకు కట్టుదిట్టములు చేసుకొనిరి. మామూలు గేటునుంచి యొక విద్యార్థిగాని, వుపాధ్యాయుడుగాని వెళ్ళలేదు. కాని ఆస్కూలు ఆవరణలోనే హెల్తువీకు జరుగుచుండుటవలన విద్యార్థులకు వుపాధ్యాయులను కొంతమందిని హెల్తువీకు పెండాలులో కూర్చుండపెట్టిరి. వీరి సంఖ్య 100 కు మించదు. చివరకు ఆ హెల్తువీకు గేటు యందుకూడ విద్యార్థులుపికెటింగు ప్రారంభించిరిమున్సిపల్ వుద్యోగస్థులందరు సమ్మెకు వ్యతిరేకముగా వుపయోగింపబడిరి.

అయిననూ పరీక్షలు జరుపలేకపోయిరి, చివరకు సమ్మె కమిటీని సమాధానపరచుటకు ప్రయత్నములు జరిగినవి. పురపాలక సంఘ వుపాధ్యక్షులగు పోతిన గణపతిరావుగారు (కాంగ్రెస్) ఇంటూరి వెంకటేశ్వరరావు (టౌను కాంగ్రెస్ కమిటీ కార్యదర్శిగారు) విద్యార్థుల కోర్కెలన్నియు సమగ్రముగా నెరవేర్చునట్లు తాము బాధ్యత తీసుకొను చున్నామని సమ్మె కమిటీకి వాగ్దానము చేసిరి, అందుమీదట సమ్మె తాత్కాలికంగా ఆపుదల చేయబడినది. హిందూ స్కూల్ హెడ్‌మాస్టరుగారు కూడ మున్సిపల్ స్కూలు మాదిరిగానే చేయుటకు గణపతిరావు, వెంకటేశ్వరావు గార్ల యెదుట అంగీకరించిరి.

ఇది ఇట్లుండ కృష్ణాజిల్లా డి. ఇ. ఓ. గారు రెండుపేజీల పైపు సర్క్యులర్ హెడ్ మాస్టర్లకు పంపిరి, విద్యార్థుల కోర్కెలు మన్నించి డిటెన్షన్పు పద్ధతిని త్రోసిపుచ్చిన యడల పాఠశాలలకు రికగ్నిషను కూడ పోవునని బెదరించి విద్యార్థులు కోరిన పత్రికలు, గ్రంథములు తెప్పించుటకు సమ్మతించుట అసంభవమని కూడ తెలియచేసిరి.

విద్యార్థులకు యిచ్చిన మాట నెరవేరని యెడల విద్యార్థులు తిరిగి సమ్మెచేయు హక్కు వున్నది. (మా విలేఖరి)

# తిరువాన్కూరు పోరాటం తీవ్రరూపం దాల్చింది!

## పన్నుల నిరాకరణకూడా ప్రారంభించబోతున్నారు.

మహారాజా జన్మదినోత్సవంపేరుతో సంస్థాన ప్రభుత్వం స్టేటు కాంగ్రెసు నాయకులను విడుదలచేసింది. క్రిమినల్ లా అమెండ్మెంటును ప్రయోగించడం ఉపసంహరించుకొంది. కాని స్టేటు కాంగ్రెసు వర్కింగు కమిటీ సభ్యులైన అనీమా స్కారీన్నుగారికి రాజద్రోహనేరం క్రింద 3 సంవత్సరాలు శిక్ష 3 నెలు జరిమానా విధించబడింది. క్రిమినల్ లా చట్టముక్రింద శిక్షింపబడ్డారనే కారణంలో శ్రీ. టి. థామస్‌గారు రెండు సంవత్సరాలకు ప్లీడరు ప్రాక్టీసు చేయరాదని నిషేధించబడ్డారు. ఈవిధంగా సంస్థానంలో నిర్బంధవిధానం సాగుతూనేవచ్చింది.

ప్రభుత్వం, తిరువాన్కూరు నేషనల్‌కాంగ్రెసు అను సంస్థను స్థాపించి దానిపేర రాజభక్తిసభలు జరుపుతూంది. ఈ ప్రచారాన్ని ఎదుర్కొనే టందుకు స్టేటు కాంగ్రెసువారు ఆప్రాంతాలందే సభలు జరిపింది. ప్రజలందరూ స్టేట్ కాంగ్రెసు సభలకు హాజరయి నేషనల్ కాంగ్రెసు సభలను బహిష్కరించి వారికి గుణపాఠం చెప్పారు. ఒక గ్రామంలో నేషనల్ కాంగ్రెసు పోస్టర్లను వేసేవిస్తే ప్రజలు ఆపోస్టరులను అణచివేశారు.

మహారాజు జన్మదినోత్సవం పేరుతో వాటిటిని యూనొల్ఫసాటి గమిపును స్టేట్ కాంగ్రెసు స్వతంత్రంగా వినియోగించుకొన్నదనే చెప్పాలి. ప్రతి తాలూకాయందును తన శాఖల నేర్పాటు చేసుకొన్నది. అఖిల తిరువాన్కూరు వాలంటీరు దళాన్ని ఏర్పాటు చేసింది. సంస్థానంలో జరుగుతూన్న కార్మిక ఉద్యమానికి సానుభూతిచూపి వారి హక్కుల విజయానికి తోడ్పడినది. నేషనల్ కాంగ్రెసు పేరుతో సంస్థానంలో సాగుతూన్న అసత్య ప్రచారాన్ని తీవ్రంగాఎదుర్కొని స్టేట్ కాంగ్రెసు సందేశాన్ని గ్రామ గ్రామాలా ప్రచారం చేసింది.

మహాత్మాగాంధీగారితో సంప్రదించడానికి ఏర్పాటుచేయబడిన కమిటీ వార్ధావెళ్ళి తమ సమస్యలను తెలియజేసింది. దివాన్‌పై ఆరోపణలను ఉపసంహరించుకో వలసినదని మహాత్ము కోరగా, అట్టిపనివలన స్టేట్‌కాంగ్రెసు ప్రతిష్ఠకు భంగంవాటిల్లునని చెప్పి ఉపసంహరించుకోడానికి తమ అనంగీకారాన్ని వెలిబుచ్చింది. అందువల్ల భారత కాంగ్రెసుయొక్క సహాయంకలుగదని మహాత్ముడనగా "మా దారిని మేమే పోట్లాడతామని" తిరువాన్కూరీయులుచెప్పి ప్రదర్శించిన ఆత్మ విశ్వాసం ప్రశంసార్హం. ఈఆత్మవిశ్వాసాన్నే స్టేట్ కాంగ్రెసు వర్కింగుకమిటీ సమావేశంకూడా తదనంతరం ప్రదర్శించి దివాన్‌పై ఆరోపణలను ఉపసంహరించుకోడానికి నిరాకరించింది. అఖిల తిరువాన్కూరు స్టేట్ కాంగ్రెసును డిశంబరు 22, 23 తేదీలలో జరుపడానికి నిశ్చయించు కొన్నది.

తిరువాన్కూరుకు వైస్రాయిగారు వచ్చే సంవత్సరంలో వైస్రాయికి తమ యిబ్బందులను తెలియజేయుటానికై సంస్థానంలో మార్గమధ్య మందున్న ప్రతి ప్రాంతంనుండీ ప్రదర్శనాలను జరుపుటకు స్టేటుకాంగ్రెస్‌చే తీర్మానించబడింది. యీ ప్రదర్శనాలను ప్రభుత్వం నిషేధించింది. వైస్రాయి త్రివేంద్రం చేరుకొనుటకు మామూలు లలనుండి మార్గాన్ని ఏర్పాటుచేసింది.

డిశంబరు 8వ తేదీని స్టేట్‌కాంగ్రెసు వలంటీరుదళం, ప్రభుత్వసైనికదళానికి పోటీసంస్థ అని ప్రభుత్వం దానిని నిషేధించింది. దళాధిపతిని అరెస్టుచేసింది. క్రిమినల్ లా అమెండ్మెంటును విస్తరింపజేసి సంస్థానం వెలుపలకూడా తిరువాన్కూరు సంస్థానప్రజలు గావించిన ఉపన్యాసాలకు, చర్యలకు వారిని శిక్షించే అధికారం ప్రభుత్వానికి గలదని ప్రకటించింది.

డిశంబరు 10వ తేదీని దివాన్‌పై ఆరోపణలను గావించి రాజాకు సమర్పించబడిన మెమోరాండంలో దస్కత్తుచేసిన వారందరిపై రాజద్రోహనేరం ఆరోపించి వారిపై కేసులుపెట్టింది. వీరిని విచారించడానికి ఒక ప్రత్యేక ట్రిబ్యునల్ (కోర్టు) ఏర్పాటుచేసి ఒకజడ్జీని నియమించింది. ఈయన తీర్పుపై అప్పీలులేదు. ఈయన తన యిష్టానుసారం, రహస్యంగాగాని, లేక కమీషన్లు పంపిగాని సాక్ష్యాన్నితీసుకొని విచారణ సాగించవచ్చును.

డిశంబరు 13 వ తేదీన స్టేట్ కాంగ్రెసు మహాసభ నిషేధింపబడింది. స్టేట్ కాంగ్రెసు పన్నుల నిరాకరణకు ప్రజలను ప్రేరేపిస్తోందనుకను వైస్రాయిరాక సందర్భంలో ఏర్పాటుచేయబడనున్న ప్రదర్శనాలు ఉపద్రవకరమంగా ప్రకటింపబడుపదేమను డిశంబరు 22, 23 తేదీలలో జరుగబోయే స్టేట్ కాంగ్రెసు మహాసభ సంస్థానాధీశునికి వ్యతిరేకంగా ప్రత్యక్షపోరాటాన్ని సాగించాలనే విషయాన్ని చర్చింపబోతోంది గనుక యీ మహాసభ నిషేధింపబడింది అని ప్రభుత్వం ప్రకటించినది.

ఈవిధంగా బాధ్యతాయుత ప్రభుత్వంకొరకు నెలల తరబడి పోరాటాన్ని సాగించిన స్టేట్ కాంగ్రెసు యీ నిషేధాజ్ఞను లెక్కచేయకుండా ఉల్లంఘించి తీరుతుందని కాంగ్రెసు ప్రెసిడెంటు పట్టంతాను పిళ్ళేగారు ప్రకటన చేశారు.

తిరువాన్కూరు రైల్వేస్టేషన్ మైదానంలో సభ జరిపి దివానుపై ఆరోపణలను ఉపసంహరించుకోరాదని ఉపన్యాసాలిచ్చినందుకు యూత్‌లీగ్ కార్యదర్శులు అరెస్టు చేయబడ్డారు.

మహాత్మునివద్దనుండి పట్టంతాను పిళ్ళేగారికి ఒక తంతి వచ్చింది. దానిని చర్చించుటకు స్టేట్ కాంగ్రెసు వర్కింగు కమిటీ సమావేశము కానున్నది.

# మహమ్మదీయ సోదరుల కొక మనవి!

కామ్రేడ్ డా॥ అష్రఫ్

హైదరాబాదు సంస్థాన ప్రజలు పౌరహక్కులకై సాగిస్తూన్న శాంతియుత సత్యాగ్రహం పట్ల మహమ్మదీయ పత్రికలలో సాగుతున్న అసత్య ప్రచారాన్ని ఖండించి, అభివృద్ధి అనుకూలురైన ముసల్మానుల దృష్టిని దానివైపుకు మరల్చ వలసిన తరుణం వచ్చింది. హైదరాబాదు ప్రభుత్వం ఆమోదించినవి తప్ప ఇతర మీటింగులు ఏవీ సంస్థానంలో జరిగేటందుకు వీలులేదు. ఈమధ్యనే హైదరాబాద్ నగర్‌లో ఖిల్లాఫాయి ఉపన్యాసం వీలులేదని నిషేధించ బడిన సంగతి లోక విఖ్యాతమే.

స్టేట్ కాంగ్రెసుపై నిషేధం.

హైదరాబాదు సంస్థానంలో నైజామ్ పాలన క్రింద, బాధ్యతాయుత ప్రభుత్వమును, శాంతియుతమైన సక్రమ పద్ధతుల ద్వారా ఏర్పాటు చేయాలనే అభిలాషతో సంస్థాన. మంచిలి దేశభక్తులు కొందరు పూనుకొని స్టేట్ కాంగ్రెసును ఏర్పాటు చేశారు. వయస్సువచ్చిన ప్రతి వ్యక్తికి అందు సభ్యత్వమునకు అధికారం ఉంది. మత సంస్థలకు సంబంధించిన వారి నెవరినీ కార్యనిర్వాహక వర్గమునకు గాని, దాని శాఖలలో గాని, సభ్యులుగా ఎన్నుకోబడ రాదని నియమావళిలో నిర్వచింప బడియే ఉంది. దేశీయులను ఐక్యంచేసి, మానసిక ఆర్థిక పారిశ్రామిక నైతిక శక్తులను అభివృద్ధి చేసి సక్రమమైన శాంతియుత విధానం ద్వారా తన ఆశయాన్ని సంపాదించాలని కూడ నిర్వచింపబడింది. మత స్వభావాన్నుండి దానను రక్షించుకోడానికి ఇంత శ్రద్ధను ఏ సంస్థకూడా తీసుకోలేదు. అయినప్పటికీ నైజాం ప్రభుత్వం దీనిని మతసంస్థయే ననియు హైవారిప్రోత్సాహంవల్లవచ్చిందనీఅంది. పైగా హైదరాబాదులో సాగే పోరాటం, ఎన్ని తప్ప పన్నాలు చెప్పినా మతవ్యవహారం దాని వలునబడి దానిలో ఉంచి తీరుతుందని, తిరుగుబాటు స్వభావంకలిగి ఉంటుదని ప్రభుత్వం చెప్పింది ఆపేరుమీద కాంగ్రెసుప్రవేశముందే దానిని అణచివేయడానికి అధికారులు శ్రద్ధ వహించుకొన్నారు.

శాంతియుతమై ధర్మబద్ధమైన హక్కులను

> **'నవశక్తి' నైజాముగుండా పోగూడదట!**
>
> కొల్లాపురం.
> 12—12—38
>
> నవశక్తి సంపాదకులకు
>
> మహాశయా : వందనములు
>
> తాను పంపుచుండిన "నవశక్తి" యింతవరకున్ను సక్రమముగానే చేరుచుండెను. కాని నా దురదృష్ట వశాత్తు ది 7-12-38 నాటి పత్రిక కర్వత్తిరివాడి (ఒక నైజాం ఉద్యోగి) చేతిలో చిక్కుటచూచి మిక్కిలి చింతించితిని. అదినైజాంలో ఇంతవరకు నిషేధింపబడలేదు. కాని ఆ మహమ్మదీయ ఉద్యోగి తనస్వయం హుకుమను జారీచేసి పోష్టుప్యూనును, నన్ను తూలనాడి అరెస్టు చేయించెదననికూడా బెదరించినాడు ఈ విషయమై తగు చర్య గైకొనుటకు సిద్ధముగానే యున్నాను.
>
> ఇట్లు,
> (Sd). టి. నారాయణస్వామి.

సంపాదించుకొనుటకు తనకు హక్కున్నదని గుర్తించిన ప్రతివ్యక్తి ఆత్మగౌరవం, పౌరుషం గల ప్రతివ్యక్తికూడా తన హక్కులను నిలుపుకోడానికి శాసన ధిక్కారాన్ని సాగించితీరాలి. ఈ ప్రయత్నంలో హిందూసివిల్‌లిబర్టీస్‌యూనియన్, ఆర్యన్ డిఫెన్సులీగులతో తమకు సంబంధంలేదని స్టేట్ కాంగ్రెసు నాయకులు ప్రకటించారు. పై సంస్థలు రెండు స్టేట్ కాంగ్రెసు తరపున జరిగే ప్రజాపోరాటాన్ని విస్మారంచేస్తూ యిదే సమయంలో సత్యాగ్రహాన్ని సాగించాయి. స్టేటు కాంగ్రెసు ఇంకా శ్రద్ధవేసుకొని సంస్థాన ప్రభువుతో పోరాటాన్ని సాగించేరు. క్విడివారా లలోనే సుమారు 15 దఫాలు సత్యాగ్రహులు అరెస్టు అయారు.

యీ పోరాటం యొక్క ప్రాముఖ్యతను అభినందించ డానికి జమలు మహమ్మదీయ వ్యక్తులు, మధ్య వరగతాలలోని ముస్లింలీగులు స్టేట్ కాంగ్రెసుపై మత సంబధాలను ఆరోపించి సంస్థాన ప్రభుత్వ చర్యను సమర్థిస్తూ వుండటం చాల విచారకరం. యీ సైత్యంలో కొందరు ముసల్మానులు హైదరాబాదు ప్రభువు యొక్క పరిపాలనను రక్షించడానికి ప్రతి సత్యాగ్రహం చేయాలని కూడా అనుకుంటూన్నట్లు తెలియవస్తోంది. యీ తోరణి మహమ్మదీయులందరు నిరంకుశ పరిపాలనా రక్షకులని అనుకొనే అవకాశం ఇతరులకు ఇవ్వడమే గాక, కాశ్మీరం మొదలయిన సంస్థానాలలో ఆర్థిక, రాజకీయ పౌరసత్వ హక్కులకై పోరాడుతూ వున్న మన సోదరుల దృష్టిలో కూడ మనలను అప్రతిష్ఠ పాలు చేస్తుంది అందుచే హైదరాబాదు సంస్థానంలో ప్రారంభమయి అభివృద్ధి పొందుతూన్న, ప్రజాపోరాటం అభివృద్ధికోసం స్వాతంత్ర్యం కోసం మన దేశీయు లందరూ సాగించే పోరాటమంచలి భాగమేననియు,దానిని అందరూ ఆహ్వానింపవలసి యుంటుం దనియు, భారత దేశీయ మహమ్మదీయ సోదరుల నందరినీ కోరుతున్నాను. ప్రస్తుతం సంస్థానాలలో సాగుతూన్న నిరంకుశ పరిపాలన మహమ్మదీయ ప్రజాసామాన్యపు హక్కులతో యేమాత్రము అన్వయించదు సరిగదా, వాటి సాంప్రదాయాలకు భిన్నమైన స్వభావం గలిగి బ్రిటిషు ప్రభుత్వము మీదనే ఆధారపడి మన దేశీయ అభివృద్ధిని భంగపరచే స్వభావం గలది. ఇట్టిదుష్పరిపాలనకు మనం ఏవిధమైన సానుభూతిని, సహకారాన్ని వెల్లడించ కూడదు. స్వాతంత్ర్యం కొరకు అభివృద్ధి కొరకు మనదేశంలో జరిగే పోరాటాన్ని, కాంగ్రెసుతో కలసి ఈ ముస్లింలీగు, అసత్యములైన సమస్యలపై ప్రజలను చీలగొట్టింది "ఫ్రీ" అని దేశీయులచేత అనిపించుకోకుండా మహమ్మదీయ సాంప్రదాయంలో ఇమిడియున్న సంపూర్ణ స్వాతంత్ర ప్రజాస్వామిక ఆశయాలను ప్రదర్శించి, దేశీయ స్వాతంత్ర్య పోరాటాన్ని బలపరచవలసిందని, ముస్లింలీగు సభ్యులను నేను కోరుతున్నాను.



# ★ ఉత్తరాలు ★

## కారు డ్రైవర్లు

ఆంధ్రరాష్ట్రీయ మోటారు డ్రైవరు సోదరులకు నాహెచ్చరిక. మే, జూను నెలలో మెడ్రాస్ కాంగ్రెస్ మినిష్టర్లతో జరిపిన రాయబారములవల్ల నేటికి మనము కోరినకోరికలు కొన్ని నెరవేర్చినారు. అవి ఏవి యనగా క్రొత్త మోటారు వెహికిల్ చట్టములో వ్యక్తులు పెద్దవి మార్పుచేసి చిన్నవిగా,బిలునసు 2 లం 1½ కు గుంత్రముగా ప్యాసుచేసినారు.

2. ఓవరులోడు డ్రైవరుకు సంబంధము లేనట్లు చేసినారు.

3. ఓవర్‌స్పీడునీల్ చేయుటకు ఆయా జిల్లాల అధికారులకు, హుకుమ్ జారీ చేసినారు. ఈ మూటిని గురించి నేను లోగడ రాముని మీనన్‌గారితోను, ప్రధాన మినిష్టరుగారితోను పిటీషన్ల ద్వారాగా ఎదురుపడి అడిగియున్నాను. కనుక డ్రైవరులంతా మీకిప్పుడు ఉన్న బాధ్యతలన్ని కలిసి సూపరెంటు వారివారికి పంపితే చిన్నవి పంపుతారు. ఓవరులోడు కేసులో అవాదముగా డ్రైవరుమీదకూడా కేసు పెడతారు. డ్రైవరుకు సంబంధములేదని మేజిస్ట్రేటుగారితో చెప్పినమీద, తీసివేయుదురు. మీరెల్లరును త్వరలో మేల్కాంచుడని కోరుచున్నాను.

ఇట్లు విధేయుడు,
తోట నరసయ్య.

* * *

## అక్రమపు దాడి

అర్యా,

గన్నవరం తాలూకా, మేమూరు గ్రామ డిప్యూటీ మునసబుగారి విషయమై విరోధులు అక్రమపు సంగతులతో 7-12-38 వ తేదీన మీ పేపరులో ఒక వ్యాసము ప్రచురణ చేసిరి.

సదరు అంశములు సరియైనవి కావని ఈ క్రింది విషయమువలన స్పష్టము.

అసలు గ్రామమునసబుగారు 1936 వ సంవత్సరం డిశంబరు నెలలో మరణించిరి. వారికి మైనరు కుమార్డు గలడు. గ్రామంలో ఎవరు అప్పటిలో మునసబు పరీక్ష అయినవారు లేరు. అందువలన అన్య గ్రామస్థులవద్ద దరఖాస్తులు తీసుకొని కలెక్టరుగారు ఇప్పటి డిప్యూటీ మునసబుగారిని అప్పాయింటుమెంటుచేసిరి.దరిమిలా ఖాయపు మునసబుగారి వారసులలో కొంతమంది 1937 వ సంవత్సరం డిశంబరుపరీక్షలో ఉత్తీర్ణులైనారు. అప్పటి నుండి ఉద్యోగము తమకు రావలెనని గ్రామంలో గల కొంతమందిచే అడిగించిరి. అందుమీదట మునసబుగారు నిరాకరించుటచేత, నూజవీడు డిప్యూటీ కలెక్టరుగారికి వారసులమని ఉద్యోగము తమకు రావలెనని పిటీషను పెట్టుకొని యున్నారు.

అంతటిలో తృప్తి నొందక గ్రామస్థులలో ఒకరు అభూతకల్పనలుచేసి ఇదివరలో బందిలదొడ్డి విషయమై తహశీల్‌దారుగారికి పిటీషను పెట్టగా వారు ఫీరంకి లాకు మకాములో విచారణ చేసిరి. సదరు కేసును త్రోసివేసినట్లు తెలియుచున్నది.

ఇంతవరకు మీ పేపరు 10 వ పేజీలో వ్రాసిన వ్యాసములో అబద్ధపు సంగతులు జతచేసి వ్రాయించినారు. సదరు వ్యాసము ఎవరు వ్రాసినది తెలియరేదు.

ఏదోవిధముగా పరాయిగ్రామస్థుని ప్రవేశింపజేయవలెనని గ్రామమునసబుని ఉద్యోగము రాకె నామాయిచ్చి పెట్టుమని దరఖాస్తుచేసింది పేపరులో యిట్టి అక్రమవ్యాసములువ్రాయుచున్నారు. సదరు 7-12-38 తేదీన ప్రచురించిన వ్యాసము ద్వేషమువలన వ్రాయబడినది.

డిప్యూటీ మునసబుగారు చాల మంచివారు, కుర్రవారు. ఆయన ఉద్యోగముచేయుట చూచి సహించలేని స్వార్థపరులు, వ్రాసిన వ్యాసమును చూచి ఎవరును నమ్మకుందురు గాక.

క్రొత్తగా వచ్చిన మునసబుగారు గ్రామంలో అధికారము చెలాయించుట ఎంతవరకు సత్యమో పాఠకులు గ్రహించెదరుగాక.

మేమూరు, 12-12-38 } ఇట్లు
గుర్నపల్లి వెంకటసుబ్బయ్య

* * *

## చేమగ్గములు— ఉచిత లైసెన్సులు

చేమగ్గములవారికి వుచిత లైసెన్సులుయిచ్చునట్లును అందుకు వారు నిర్ణీతకాలములో తెలియపర్చుకొనవలెననిగా ప్రభుత్వ వుత్తరువున్నది. దానిని ఏగ్రామములోను గ్రామాధికారులుప్రచురపరచియుండలేదు. ప్రచురపరచకనే పరచినట్లు కాయితములు నింపుట వారికలోని బహిరంగ రహస్యమే! అందువల్ల ననేక విషయములలో ఎరిగి పై యధికారులకు విన్నవించుకొనిననూ వారిని కాగితములు త్రిప్పి టాం టాం చేసినట్లున్నది. గనుక మీప్రారబ్ధమింతే యనుచున్నారు. యిది లోకవిదితము. పైఉత్తర్వును గురించి మైలవరం ఫిర్కా చంద్రాల చేమగ్గములవారునూ వారికి తెలియగానే,ప్రభుత్వమునకు విన్నవించుకొని నుచిత లైసెన్సులు కోరినారు. ఆకాగితము లేమైననోకాని, గ్రామమునసబుగారువారునకాలములో విన్నవించుకొననందులకుగాను మగ్గము నకు రూపాయి యపరాధము విధించినారు. ఆ రూపాయిలు కట్టినకాని మీకు లైసెన్సులు రావని చెప్పినారు. 26-10-38 తేదీన మహారాజశ్రీ కాట్రగడ్డ వెంకటనారాయణరావుగారు ఆగ్రామం వెళ్ళగా మగ్గములవారీ సమాచారము మునసబుగారి యెదుటనే చెప్పినారు. అందుపై నారాయణరావుగారు రశీదుపుచ్చుకొని డబ్బు చెల్లించవలసినదిగా చెప్పినారు. తదనంతరం మునసబుగారు బదేబదే కబురుచేసిన త్తిడిపరచుటయేగాని రశీదిచ్చి పుచ్చుకొనుట కేలనో సందేహించుటచే 18-11-38 తేదీన కొందరు మగ్గములవారు తహస్సీలుదారువారికి అర్జీని పశ్చిమ కృష్ణా కాంగ్రెసు ప్రధాన కార్యదర్శిగారిద్వారా యిచ్చుకొనియున్నారు.

గాన ప్రభుత్వమువారు ఇందలి సత్యాసత్యముల విచారించి, నూతనమును, సరైన పరిచరణ జరుగకను, కొందరి గ్రామాధికారులు పరిచరించక బాధించుటకు అలవాటుపడిన వారగుటచేతనూ కొలది జీవనములతో పొట్టగడుపుకొను నీ పేదలకు ప్రథమము గనుక మన్నించి అపరాధములు నిజముగ విధించిన మన్నించి తీసివేయించ గలందులకు ప్రభుత్వము వారిని కోరుచూ వెంటనే గ్రామాధికారులకు వుత్తరువులు జారీచేయించగలందులకు కోరుచున్నాము.

అనుమకొండూడి వెంకట శీతారామారావు
ప॥ కృ॥ కాం॥ సంయుక్త కార్యదర్శి
కోడూరు.

# గమనించండి!

పశ్చిమ కృష్ణాలో

## విశ్వామిత్ర సృష్టి

| గ్రామం | జనసంఖ్య (పసిపిల్లలు, వృద్ధులు, స్త్రీలు—అంతా కలిసి) | చేర్పించిన కాంగ్రెసుసభ్యులు |
|---|---|---|
| కానవరాప | 507 | 725 |
| ముస్త్రాల | 938 | 950 |
| జయంతిపురం | 264 | 227 |

ఈసభ్యత్వములు చాక్టరు పట్టాభిగారు అంగీకరించినవేనునుండి!

## విద్యార్థులు

ఆంధ్ర విద్యార్థులమైన మనం, సామాన్య పౌరసత్వపు హక్కులు నిలబెట్టుకొనేందుకు అతి దారుణమైన, అన్యాయమైన డిటెన్షన్ పద్ధతికి బలికాకుండా సంరక్షించు కునేందుకు తీవ్రమైన పోరాటములో పాల్గొనవలసిన పరిస్థితు లేర్పడినవి. అనేకమారులు మంత్రులను, బాధ్యతగల విద్యాధికారులను పదేపదే ప్రార్థించినా ప్రయోజనమేమీ కలుగలేదు. పైగా కాంగ్రెసు మంత్రివర్గము ఈ సమస్యపైని ఒక ప్రకటన చేసింది. ఆప్రకటన, అదివరకే నిరంకుశత్వాన్ని ప్రదర్శిస్తున్న హైస్కూలు కాలేజీల పెత్తనదార్లను మరింత ప్రోత్సాహపరిచింది. దీన్ని మనం ప్రతిఘటించక తప్పదు. మన ఆత్మ గౌరవాన్ని కాపాడుకోవాలంటే, విద్యా రంగాన్నుండి ఈ విషమ డిటెన్షన్ సిద్ధాంతాన్ని సమూలముగా పెరికివేయాలి. పబ్లికు పరీక్షకువెళ్ళి విద్యార్థులు ఎవరి ప్రయత్నంవారు చేసికోకుండా ఈ వడపోత దేనికి, నాల్గు మూడు మాసములు పరీక్షలున్నవనగానే డిటెన్షన్‌లు చేయడంలో సబబేమున్నది? ఈ నాల్గుమూడు నెలలలో చదివి ప్యాసుగాలేదని ఏమహనీయుడయినా వాదిస్తారా? పరీక్షకు పంపిన విద్యార్థులలో ఈ నాల్గునెలలు చదువక పోయినా ప్యాసయ్యేపద్ధతి ఏమైనాఉందా? అసలు పరీక్షలలోనే 100 కి 25 మందిని ప్యాసుచేసి వడపోస్తుంటే ఈ వడపోతకు ముందు మరొక వడపోతెందుకు? ఇన్ని వడపోతలుపోసి, ఎంత ప్రావీణ్యంగల పట్టభద్రులను తయారు చేస్తున్నారో మన విశ్వవిద్యాలయం వారు?

ఇప్పటికయినా మించిపోయింది లేదు. కాంగ్రెసు ప్రభుత్వం, సెనేటు మరి యితర విద్యాధికారులు గమనించి ఈ పిశాచపు డిటెన్షన్ పద్ధతిని రద్దుచేయాలి. విద్యార్థి లోకము అన్నివిధాల బలవత్తర ప్రతిఘటనచేసి ఆ పద్ధతిని రూపుమాపాలి.

ఇట్లు
యం. బసవపున్నయ్య,
సెక్రటరీ,
ఆం. రా. విద్యార్థి సంఘం.

యూనివర్సిటీ ఆర్డినెన్సులు పోవాలి.

9-12-38 వ తేదీ శుక్రవారం సాయంత్రం విశాఖపట్నంటౌనుహాలులో భూపతిరాజు వెంకటపతిరాజుగారి అధ్యక్షతక్రింద పౌరసభ జరిగినది, యూనివర్సిటీ అధికారులు నూతనముగా తీర్మానించిన ఆర్డినెన్సులు స్వాతంత్ర్యోద్యమమునకు విరుద్ధమనియు, కాంగ్రెసు మంత్రివర్గమువారు సహింపరానిదనియు, కాంగ్రెసువారైన సెనేటు సభ్యులుగూడ ఆమోదించుట జాతీయోద్యమమునకు ద్రోహమొనర్చుటయనియు, కె. దాదిరాజు B. A. B. L., గారున్ను లక్నో యూనివర్సిటీ ఫిసికల్ డైరెక్టరుగారైన ఆర్.కె. నాయుడుగారున్ను, కె. వెంకట్రామశాస్త్రి, కె. వీరభద్రస్వామిగార్లున్ను, ఉపన్యసించిన తరువాత, వైస్ చాన్సలర్‌గారు తమ ఆర్డినెన్సులను ఉపసంహరించుకోవలెనని కోరుచు తీర్మానించిరి. వైస్‌చాన్సలర్‌గారివద్దకు పౌరుల రాయబారం వెళ్లుటకుగూడ నిశ్చయించిరి.

ఇట్లు,
కె. సత్యనారాయణ
విశాఖపట్నం

## మహిళా సంఘం

10-12-38 వ తారీఖున కృష్ణాజిల్లా మహిళా సంఘ కార్యనిర్వాహకవర్గం దివి తాలూకా కాజలో పేకేటి వీరారెడ్డిగారి గృహమునందు రాత్రి 8 గంటలకు శ్రీమతి వల్లభనేని సీతామహాలక్ష్మమ్మగారి అధ్యక్షతను జరిగిన సమావేశములో

1. స్త్రీల పాటలు పరిశీలించుట అయినది. మొదటి బహుమతి రు 10-0-0 శ్రీయుత దండమూరి సత్యనారాయణరావుగార్కి; రెండవబహుమతి రు 5-0-0 శ్రీమతి పోలంరెడ్డి బుల్లెమ్మగారికి. నేషనల్ కాలేజీ పండితులు శ్రీయుత కాటూరి వెంకటేశ్వరరావుగారిచే పరిష్కరించబడిన సదరు పాటలుఅచ్చువేయించి ఒకవెయ్యి ప్రతులు ప్రతి ఒకటింటికి 0-1-6 చొప్పున అమ్మించుటకు అధ్యక్షురాలికి అధికార మివ్వబడినది.

2. ఆంధ్రదేశములో ప్రథమమున స్త్రీ సభ్యురాలు శ్రీమతి కె. రామసుబ్బమ్మగారిని కడప జిల్లాబోర్డు అధ్యక్షురాలిగా నియమించిన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు వర్కింగు కమిటీవారిని యీ సభవారు అభినందించుచున్నారు.

3. జమీందారీరయితు విచారణకమిటీరిపోర్టు విషయమై పూర్తి కృషిసల్పి రైతు లోకమునకు మహోపకారమొనర్చిన రివిన్యూమంత్రి అభివందనీయులు, సదరు రిపోర్టు ననుసరించి వెంటనే బిల్లుప్రవేశపెట్టి ప్రభుత్వముచే అంగీకరింపచేయవలసినదిగా శ్రీ మంత్రిగారిని యీ సభవారు కోరుచున్నారు.

4. రష్యా సంచికలోని మహిళామణులను వ్యాసాన్ని జిల్లాసంఘం తరపున కరపత్రంగా ప్రకటించుటకు తీర్మానించడమైనది.

ఇట్లు,
వ॥ సీతామహాలక్ష్మమ్మ
అధ్యక్షురాలు.

## నేటి ప్రపంచం

(13 వ పేజీ తరువాయి)

మని మంత్రి స్టాలీ అన్నాడు. ఛాంబర్లేనుకూడ జర్మనీని హెచ్చరిస్తూ "యుద్ధము చాలకాలము జరిగేటప్పుడు తనకు జయాన్ని కలుగజేసేది మన ఆర్థికసంపత్తి. జర్మనీ మన ఆయుధ సామగ్రినేగాక, మన ఆర్థిక శక్తినికూడ గమనిస్తూనేఉంది" అన్నాడు.

## అమెరికా పృక్పధం

ప్రపంచ మార్కెట్టుల కోసము, బ్రిటిషు జర్మనీ నేడు బాహాటు అమెరికా గమనిస్తూనే ఉంది. ఒక న్యూయార్కు పత్రిక "బ్రిటిషు అధికారము పోతే అమెరికాకు తీరని దెబ్బ" అన్నాడు. నిజమే జర్మనీ పోటీ, ఇంగ్లండు పోటీకన్న ఎక్కువ తీవ్రంగా ఉంటదనే గాక. బ్రిటిషు సామ్రాజ్యంతోటి అమెరికా వర్తకానికి కూడా దెబ్బ తగులుతుంది.

దక్షిణామెరికాలో జర్మనీ వర్తకపు పోటీని ఎదుర్కొనడానికి అమెరికను రిపబ్లికుల సమావేశంలో యునైటెడ్ అమెరికను ప్రంటును ఏర్పరచాలని మెంజూరా మొదలగు దేశాలు అన్నాయి. కాని, జర్మనీతో విరివిగా వర్తకం చేస్తూఉన్న బ్రెజిలు, ఇంగ్లండుతో ఎక్కువ వర్తకమున్న అర్జంటైనా, చిలీదేశాలు ప్రతిఘటించాయి.

నూనెగనులు ఆక్రమించుకుందని మెక్సికో ప్రభుత్వంపై అమెరికను ప్రభుత్వము ఒత్తిడి తెస్తూ ఉండినసమయంలో, మెక్సికో జర్మనీకి తన నూనెను చౌకగా అమ్మడానికి, దాని విమాన యంత్రాలు దిగుమతి చేసుకోడానికి ఒక ఒడంబడిక చేసుకుంది. అందుచే మెక్సికోకూడ డాలరు రాజ్యంలోకి పోవడానికి ఒప్పుకోవడము లేదు.

అయినా, దక్షిణ అమెరికా రిపబ్లికు లన్నియు ఇకముందు, తమలో తమ పరస్పర వర్తక వ్యాపారాలకు ఉండే అడ్డములను తొలగించాలనే నిర్ణయానికి వచ్చాయి. దీనితో జర్మనీ వర్తకానికి మరియొక దెబ్బ తగిలింది.

## పూర్వప్రాచ్య దేశాలు

అమెరికా వ్యాపార వ్యాపకము కోసము చైనాలో తాను స్వేచ్ఛగా వ్యాపారము చేసుకోడానికి 9 రాజ్యాల ఒడంబడిక ప్రకారం అవకాశము కల్పించమని జపానును కోరింది. జపాను నిరాకరించింది. పరిస్థితులు మారాయిగాని 9 రాజ్యాల ఒడంబడిక ఇప్పుడు ఇక చెల్లదట; 9 రాజ్యాలు కలసి రద్దుచేయాలి గాని ఒక్క రాజ్యమే దానిని రద్దు చేయుటకు అవకాశము లేదంటారు చైనా వేసియును. కొమింటాంగు రాజకీయ కొన్నిలు అర్పణము చాంగ్‌చింగు పై చైనాకు సాయము చేయవలసినదిగా ఒక ప్రకటన చేశారు. ఈ ప్రకటన మూలముగా గాక పోయినా తన వర్తక వ్యాపారాభివృద్ధి కోసం అమెరికా 50 లక్షల పౌనులు అప్పు ఇవ్వడానికి ఒప్పుకుంటున్న వార్తలు వస్తున్నాయి, బ్రిటను..న అప్పు ఇస్తుందని మరియొక వార్త.

కాని బ్రిటను అప్పు ఇస్తుందని అన్నా నమ్మకము లేదు. కాంటను నగరాన్ని పట్టుకొనే పూర్వమే జపానుకు బ్రిటను చాలా సుముఖంగా వుందని విదేశ పత్రికలలో వార్తలున్నాయి. ఈ విధించు, తమకు చైనాలో వర్తకవ్యాపారాల కోసం అధికారము, తమకు పూర్వ హక్కులు ఇమ్మని కోరడానికే అని అనుకుంటాము. ఈ మధ్య జపాను విదేశ ప్రభుత్వాలకు ఉండే ఎక్స్‌ట్రా టెరిటోరియల్ అధికారాలు రద్దు చేయబడతాయి అనీ, వారికి సొంతంగా ఇచ్చిన పట్టణాలు తిరిగి తీసుకొంటామని ప్రకటించింది. ఆ ప్రయత్నాలు విరమించడానికి ఇది బెదిరింపు గాని మరేమి కాదని అనుకుంటాము. లేదా చియాంగుకై షేకు సహాయము చేసినట్లుచేసి, రష్యాకలిమిడి నుండి తప్పించి జపానుతో సంధికి వచ్చేటట్లు చేసి, జపానును, చైనాను ఇద్దరినీ తమచేతిలో ఉంచుకోడానికైనా కావచ్చు. అంతే గాని జపాను పతనాన్ని, ఛాంబర్లేన్ ఓర్వడు. కారణము జపాను అపజయములో జపానులో విప్లవము, చైనాలో కార్మిక కర్షకుల ప్రభుత్వం, దానితో ప్రపంచంలో ముఖ్యముగా భారతదేశములో విప్లవ జ్వాల. ఇటలీ, జర్మనీ నియంతల పతనముతో అక్కడ సోవియటు ప్రభుత్వము ఏర్పడుతుందనే భయమేలా ఛాంబర్లేను కుంటో అలాగే ఇక్కడకూడ ఉంది.

చైనాలో యుద్ధము సాగుతూనే ఉంది. జపాను హాంకో కాంటను రైలుమార్గాన్ని పూర్తిగా ఆక్రమించుకొని ఉదుపరి సముద్ర తీరానికి ఈ రైలుమార్గానికి మధ్యన తమకు ఇంకను లోబడని దేశాన్నంతా వశపర్చుకోవాలని ప్రయత్నిస్తూ ఉంది. చైనాలో వ్యాపారం చేసే సంస్థల నన్నింటినీ, కేంద్రీకరించింది. సేనాధిపుల నాయకత్వం క్రింద చైనాలో జపాను కీలుబొమ్మ ప్రభుత్వాలయిన నాంకింగు, పికింగు ప్రభుత్వాలను కలిపి చైనా కేంద్ర ప్రభుత్వాన్ని ఏర్పరచాలని ప్రయత్నిస్తూ ఉంది.

అయినా చైనా జపానుతో రాజీకి రావడం లేదు. చియాంగుకేషేకు అభిప్రాయాలేలాఉన్నా కమ్యూనిస్టుల పలుకుబడి, చైనాప్రజల చైతన్యం రాజీని తలపెట్టనివ్వడములేదు. చియాంగుకైషేకు మునుపటివలె బహిరంగంగా మైదానంలో జపానును ఎదుర్కొనడము మాని కమ్యూనిస్టుల యుద్ధవిధానాన్ని అవలంబించాడు. ఈ గొరిల్లా యుద్ధం తమకు ముప్పుతెస్తుందని జపాను గ్రహించింది. మేము 5 లక్షల సైన్యంతో వస్తాము. మీ అసంఖ్యాక సైన్యాలతోవచ్చి మమ్ము ఢీకొంటే అని జపాను సేనాని ఛాలెంజి చేశాడు. దీనిని ఎవరూ లెక్కచేయలేదు.





